

చార్మినార్ — సి. వి. ఎస్. శర్మ


వీనస్ పిక్చర్స్ సమర్పించు అశోక్ మూవీస్
సుమంగళి
దర్శకుడు
ఆదుర్తి సుబ్బారావు
నిర్మాత
గోవిందరాజన్
రచన
ఆత్రేయ
సంగీతం
మహదేవన్
స్టూడియో
శ్రీ సారథి
డిస్ట్రిబ్యూటర్స్
అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

# నేడే చూడండి










శ్రీ వాణీ ఫిలింస్



# నాదీ ఆడజన్మే

దర్శకత్వం: A.C. త్రిలోక్‌చందర్ M.A., నిర్మాత: S.V. రంగారావు B.A.

స్టూడియో: ఏ.వి.ఎమ్

G.H. RAO

వెండితెర నవల వెల 1 రూపాయి. ప్రతులకు—ప్రజారంజని, బెంగుళూరు_25.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంక్రాంతి సంచిక ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది మూడు రంగులతో కన్నులకు విందు చేసింది వేసిన బాపు గారికి, ప్రచురించిన మీకు మా అభినందనలు

నారాయణరావు (మద్రాస్)

* * *

రమ్యమైన ముఖచిత్ర రచనతో వెలువడిన సంక్రాంతి సంచిక మమ్మెంతో రంజింప జేసిం దంటే అది అతిశయోక్తి కాదంటాను ఇంత చక్కని ముఖ చిత్ర రచన చేసిన శ్రీ బాపు గార్ని అభినందించలేకుండా ఉన్నారంటే మీరు నమ్ము తారు కదూ ! బి పద్మ (గుంటూరు)

## కథలు

8-1-65 సంచికలో ప్రచురించిన 'వ్యథిత హృదయాలు' కథ వాస్తవానికి దగ్గరగా ఉన్నది. ఆ కథ చదువుతున్నంత సేపూ నా హృదయం వ్యథతో కుమిలిపోయింది ఇంత చక్కని కథ వ్రాసిన రచయిత్రికి, ప్రచురించిన మీకు నా ధన్య వాదాలు

ఎం పురుషోత్తంనాయుడు (మద్రాస్)

## వ్యాసాలు

శ్రీరామచంద్రగారు వ్రాసిన 'సృష్టిలోనే క్రాంతి' వ్యాసం చాలా బాగుంది సంక్రాంతి గురించి కొత్త విషయాలు తెలియ జేస్తూ ఎంతో విజ్ఞాన దాయకంగా ఉంది ఇటువంటి వ్యాసాలు ఇక ముందు కూడా ప్రచురిస్తారని ఆశిస్తున్నాము

ప్రభాకర్ (విజయవాడ)

* * *

"అందాల తార, వెండితెర వెలుగు, సరోజాదేవి"ని మాకు పరిచయం చేసిన మిమ్మల్ని ఏ విధంగా అభినందించాలో తెలియడంలేదు మేము ఎన్నాళ్ళ నుంచో ఎదురు చూసిన వ్యాసం మా కంట కనుపడటం నిజంగా మా అదృష్టమనే అనుకోవాలి రచయితకు మా ధన్యవాదాలు

ఎ సుబ్బారావు (హైదరాబాదు)

## సీరియల్ కథలు

సంక్రాంతి సంచికలో మొదలైన కార్వేటి గారి 'అపస్వరం' ఆరంభంలోనే ఎంతో ఆహ్లాద కరంగా ఉంది ముందు ముందు ఈ సీరియల్ పాఠక హృదయాలను మరింతగా ఆకట్టుకో గల దనిపిస్తున్నది రచయిత్రికి, మీకు నా అభినంద నలు జగన్మోహన్ (విజయవాడ)

* * *

బంగారు నడచిన బాట కథలో క్రొత్తదనం లేదు ఎందుచేతనంటే ఇది ప్రస్తుత అంతర్జాతీయ రాజకీయాలకు వేరే పేర్లు పెట్టి చిత్రీకరించినారు బంగారు ఇండియా, సర్వమంగళం చైనా, టక్కుటమారం పాకిస్తాన్, నల్ల పిల్లలు కమ్యూనిస్టు పార్టీ, పారిపోయి వచ్చిన జింక సుందరాంగం దలైలామా

వి. లక్ష్మీశాస్త్రి (సికిందరాబాదు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 22—1—'65
క్రోధినామ సం॥ పౌష్య మాస బ॥ షష్ఠి
సంపుటము 57 సంచిక 21

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

**ఒక సంవత్సరం చందా వివరాలు**

ఇండియా రూ. 15 60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ 120 00. అమెరికా రూ 176 80 ఆస్ట్రేలియా రూ 148 20

విడి ప్రతి 30 పై.
సంవత్సర చందా 15 60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1




'ఆహాహా! డెమోక్రాటిక్ హక్కులను గురించి మాట్లాడేది కమ్యూనిస్టులా ?

## మనలో మాట

చాలా మంది పాఠకులు సినిమా బాలట్ పత్రాలు నింపి పంపుతున్నారు. మా కార్యాలయం చేరే వాటి సంఖ్య చూస్తే బాలట్ విజయవంతంగానే కొనసాగేట్లు ఉంది...

* * *

'గంధర్వ ప్రశ్నలు' పోటీ ఫలితాలు ఒక వారం ఆలస్యంగా వేశాము! పోటీలో గెలిచిన వారందరికీ రికార్డులు పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. అందరికీ మా అభినందనలు !

* * *

ఈ వారం మరొక కొత్త శీర్షిక మొదలు పెట్టాము. 'విచిత్రకథలు' వివిధ దేశాలలో ప్రచారంలో ఉన్న వింత కథలను పాఠకులకు అందిచ్చే శీర్షిక...

* * *

'ఎవరెవరు' మీద కొన్ని 'వ్యాఖ్యలు' వస్తున్నాయి. త్వరలో వీటికి శ్రీ మోహన్ కుమార్ సమాధానం ఇవ్వగలరు.

* * *

15-1-'65 తర్వాత మా కార్యాలయం చేరిన కథల విషయంలో ఒక కొత్త పద్ధతిని అవలంబించ నిశ్చయించాము, ప్రచురణకి స్వీకరించని కథల రచయితలకి ఆ విషయం సాధ్యమయినంత వరకూ తెలిపే ప్రయత్నం చేస్తాము. కాని, ఈ విషయంలోనూ ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు-ప్రచురణకి స్వీకరింపబడని కథతో తగినన్ని తపాలాబిళ్లలు కాని, అవి అతికించిన చిరునామా కల కవరుగాని ఉన్నట్లయితే అది తిప్పి పంపటానికి అన్ని ప్రయత్నాలూ చేస్తాము ప్రాతప్రతులు తిప్పిపంపే విషయమయి ఎటువంటి హామీ మాత్రం ఇవ్వజాలము.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం. నటి జయలలిత


దుర్గాపూర్ కాంగ్రెసులో ఆర్థిక తీర్మానం
అదంతా భ్రమ కాదూ?
గాలి మేడలు


శుభవార్త! అణుబాంబు వ్యతిరేకతకే కాంగ్రెసులో విజయం లభించింది!


ఇతరులే మనల్ని రక్షిస్తారు
చైనా దాడి చేయదు
అణుబాంబులు అక్కర లేదు!
విచిత్ర తతంగం
భ్రమ


చూసుకోండి నే గెలిచాను
పతనానికి ముందు ..!
OOMMEN



దుర్గాపూర్‌లో కాంగ్రెసు పెద్దతలలన్నీ మళ్లీ కలిశాయి కానీ, యీ పెద్దల అభిప్రాయాలన్నీ కలిశాయో లేదో! ఈ చిత్రంలో కామరాజ్, లాల్ బహాదూర్ శాస్త్రి, ప్రభృతులను చూడవచ్చును.

న్యూఢిల్లీనుంచి 'శ్రీకృష్ణ' సమీక్ష

# దుర్గాపూర్ నేర్పిన గుణపాఠం...!

ఈవారం విశేషం దుర్గాపూర్ కాంగ్రెసు సమావేశమే గాంధీ నిర్మించిన, పండిట్ నెహ్రూ పెంపొందించిన ఈ మహాసంస్థ చెడిపోవడం చూసి ఆ నాయకుల ఆత్మలు సంక్షోభిస్తున్నాయా?

## జగ్జీవనరాం వ్యతిరేక చర్యలు

అసలు కాంగ్రెసుపార్టీ ఉద్ధరించిన హరిజనుల నాయకుడు ఒకరే గ్రూపు తంతున నాయకులకి ఎదురు తిరుగుతున్నారు డాక్టర్ అంబేద్కర్‌కి ఎదురుగా జగజీవన్‌రాంని పైకి తీసుకరావటం జరిగింది బ్రతికున్నవారు డా అంబేద్కర్‌ని బలపరిచేవారు కాబట్టి ఇది తేలికపనే అయింది శ్రీ జగజీవన్‌రాం 1946 సెప్టెంబరు 2 వ తేదీ నుంచి 1964లో కామరాజు పథకం అమలుపరిచేదాకా మంత్రిగానే ఉండిపోయారు ఈయన హిందువులలో తీసుకు వచ్చిన విభేదాలు అన్నీ ఇన్నీ కావు పద్దెనిమిది సంవత్సరాలు ఏలిన తర్వాత తొమ్మిది నెలలు పదవి బయట ఉండడం జరిగింది. శ్రీ నెహ్రూ ఉన్నంత కాలం ఈయనకి నోరు విప్పి మాట్లాడే ధైర్యం లేకపోయింది జూన్‌లో శ్రీ శాస్త్రి ప్రధాని అయినప్పటినుంచినేటిదాకా ప్రభుత్వం తప్పుదారితొక్కడం ప్రారంభించిందని శ్రీ జగజీవన్‌రాం ఆరోపిస్తున్నారు దేశంలో అరాజకం ఏర్పడటానికి కారణం ప్రభుత్వం అనుసరించే తప్పుడు విధానాలే కారణంట తాను కాబినెట్‌లో ఉంటే వ్యాత్రం అంతా బాగానే ఉంటుందనుకోండి

దుర్గాపూర్ సమావేశంలో, స్నేహితు లెవరో శత్రువు లెవరో శ్రీ శాస్త్రికి తెలిసిపోయి ఉండాలి అంతేకాదు, తన మంత్రివర్గంలో ఎటువంటి అసమర్థులు ఉన్నారో తెలుసుకుని ఉండాలి ఆయన విధానాలుకాని, ఆయన సిద్ధాంతాలుకాని సరయినవని వాదించినవారు ఒక్కరు కనిపించలేదు ఇక తన సహాధ్యాయులకి కాంగ్రెసులో ఎంత బలం ఉందో కూడా తెలుసుకొని ఉండాలి

శ్రీ జగజీవన్‌రాంగారు ఏమన్నారు ? సోషలిజం సిద్ధించాలంటే ప్రజలకి సక్రమంగా రక్షణ లభించేట్లు చూడాలన్నారు భూసంస్కరణలు తీసుకురావా లన్నారు విద్య, శిక్షణ, భూసంస్కరణ కేంద్ర వ్యవహారాలా ? లేక రాష్ట్రాలకి బాధ్యత అధికం ఉందా ? అసలు 18 సంవత్సరాలలో శ్రీ జగజీవన్‌రాం చేసిన కృషి ఏమిటి ? కాంగ్రెసు వర్కింగ్ కమిటీలోనే ఏడు సంవత్సరాలు ఉన్నారే?

దేశంలో ధనవంతులకి ధనం ఇంకా ఎక్కువ అవుతున్నదన్న సూచన చేశారు శ్రీ జగజీవన్‌రాం; నిజమే ఇది ఆయన సభ్యులుగా ఉన్న ప్రభుత్వం పనేగదా !

## ప్రణాళికాస్వరూపంపై తర్జనభర్జనలు

నాల్గవ పంచవర్ష ప్రణాళిక మరి పెద్దది కాకూడదన్నారట శ్రీ కామరాజ్ ఆయన చెప్పినదాంట్లో చాలా నిజం ఉంది రెండవ ప్రణాళిక మొదటి రోజుల్లోనే శ్రీ కె సి నియోగికీ, తక్కిన సభ్యులకీ అభిప్రాయభేదాలు వచ్చాయి శ్రీ నియోగి, ప్రణాళిక పరిమాణాలు తగ్గించా లన్నారు ఈ విషయమును తమ అసమ్మతిని లిఖితపూర్వకంగా తెలియచేస్తామని కూడా అన్నారు రాజీలు తీసుకురావటంలో సిద్ధహస్తులయిన శ్రీ వి టి కృష్ణమాచారి కల్పించుకున్నారు; వ్యవసాయంలో 25 శాతం అభివృద్ధి ఉంటే తక్కిన వస్తువుల ధరలు పడిపోతా యన్నారు ప్రణాళిక తనంతటతనే తక్కువ అవుతుందన్నారు శ్రీ నియోగి ఒప్పుకోలేపోయారు

# రానున్న ఎన్నికలు: కామరాజ్ ముందుచూపు

భారతదేశం కష్టకాలం దానితోనే అంటే రెండవ ప్రణాళికతోనే, ప్రారంభం అయింది. అందరూ, "ఇంకా పెద్ద ప్రణాళిక, ఇంకానుంచి ప్రణాళిక" అనే పాట ప్రారంభించారు.

1962 లో రక్షణ అవసరాలకోసం ప్రణాళికని తగ్గించమని కొందరు సలహా ఇచ్చారు. శ్రీయుతులు నెహ్రూ, నందాలు ఈ సలహాని త్రోసివేశారు. ఈ సంగతిని శ్రీ కృష్ణమీనన్ కాని, శ్రీ జగజీవన్‌రాం గాని చెప్పరు. అప్పుడు శ్రీ నందాయే కదా ప్లానింగ్ కమిషన్‌కి ఉపాధ్యక్షులు? మూడవ ప్రణాళిక పరిమాణం తగ్గరాదని వాదించారే?

### ఆర్థికశాస్త్రం తెలియని మాజీ ఆర్థికమంత్రి

శ్రీ మొరార్జీదేశాయికి ఆర్థికశాస్త్రంగురించి ఏమీ తెలియదు. శ్రీ నందా చెప్పినదానికి వెంటనే నాల్గవ ప్రణాళిక ఎలా ఉండాలో వివరిస్తూ అందరు మంత్రుల శాఖలకీ 'సర్క్యులర్'లు పంపాడు: అభివృద్ధి 7 శాతం ఉంటే అన్నీ అవే చక్కబడిపోతాయనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. 1971 కి ఇండియా ఉత్పత్తి సంఖ్యలు తయారు చేశాడు.

ఇంతలో ప్రతి మంత్రి 1971 లో భారత దేశంలో వివిధ వస్తువుల 'అవసరాలు' అంచనా వేసేందుకని కొన్ని సంఘాలని నియమించారు. (గోధుమ, బియ్యం, బొగ్గు వంటి వస్తువులు) ఈ సంఘాలు ఏమి పని చేశాయో తెలియదు. కాని వారి అంచనాలు పండిత పంత్ అంచనాలని మించిపోయాయి.

ఇదలా ఉంచండి. రెండవ ప్రణాళికలోనే గాడి తప్పటం జరిగింది. రాష్ట్రాలు ఇంకా పెద్ద ప్రణాళికలు కావాలంటూ ఒత్తిడి చెయ్యటం మొదలు ఆయనకే అంటగడతారు. ఇంకా పన్నులు అధికం వేస్తే ఓట్లువేసే దెవరు? వెంటనే ధన సేకరణ కావాలని ప్రణాళికా సంఘం ఉత్తరువు జారీ చేసింది.....ఎన్నికల సమంతా శ్రీ కామరాజుదా, పండిత పీతాంబర్ పంతుదా? శ్రీ పంతు ఎన్నికలో నుంచుంటే డిపాజిట్ కూడా దక్కదేమో! అందుకనే శ్రీ కామరాజ ఆహార పదార్థాలు అందరికీ దొరకటం అన్నిటికన్నా ముఖ్యం అన్న సంగతి మిగతా నాయకులకి గుర్తు చేశారు.

శ్రీ శాస్త్రి ఈ అవకాశం పురస్కరించుకుని తమ మంత్రివర్గాన్ని మరమ్మత్తు చేస్తారా? లేక అవకాశం జారవిడుచుకుంటారా?

చైనా దురాక్రమణ సమయంలో నిరుపేదలు తమ సర్వస్వాన్ని దేశరక్షణకి ఇచ్చుకోవటానికి సిద్ధపడ్డారు. శ్రీ నెహ్రూ తమ ఉప మంత్రులని పరిశీలించుకోనటానికి ఇష్టపడలేదు. ఆ తర్వాత ఆయన



శ్రీమతి విజయలక్ష్మి పండిట్, ఇందిరాగాంధీ—దుర్గాపూర్ కాంగ్రెసుసభలో.

[illegible]న్నారు. శ్రీ నెహ్రూ కూడా అంతే. చైనా దురాక్రమణపట్ల ప్రజలు చూపిన ఉద్రేకాని కంతా తమ వ్యక్తిత్వమే కారణం అనుకున్నారు. పీటు పోక్కున్నప్పటికీ ప్రజలు ఎగిరిపడ్తారను కున్నారు. అందుకనే శ్రీ మొరార్జీ ప్రతిపాదన లన్నిటినీ ఆమోదించారు. అప్పటినుంచి బాధ్యతా రహితంగా డబ్బుని ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేస్తున్నారు. ధరలు పెరిగిపోతున్నాయి.

నాల్గవ ప్రణాళిక సంగతి ప్రస్తావిస్తాను. ఇది పండిత పీతాంబర్ పంత్ ఆధ్వర్యం క్రింద నిర్మిస్తున్నారు. ఈయన మహాలనోబిస్ వర్గం మనిషి. ప్లానింగ్ కమిషన్ అధ్యక్షుడి (ప్రధాన మంత్రి) కార్యదర్శిపదవి సంపాదించుకుని మంచి పలుకుబడి సంపాదించుకున్నాడు.

'ప్రణాళికల నిపుణుడు' అంటూ [illegible] కున్నాయి. అప్పటికీ కేంద్ర సహాయం ఉండనే ఉంది! అతి కష్టంమీద శ్రీ కృష్ణమాచారి (టి. టి. కె.) నాల్గవ ప్రణాళికని 21—22000 కోట్ల రూపాయలతో ఆపగలిగారు. అప్పటికే ఏటా 500 కోట్ల రూపాయల అదనపు పన్నులు అవసరం. దీనిని గురించే శ్రీ కామరాజు నొక్కి చెప్పారు. కేంద్ర ఆర్థిక మంత్రి అదనపు పన్నులు కేవలం కేంద్ర ప్రభుత్వపు బాధ్యత కాదన్నారు. రాష్ట్రాల ప్రణాళికలకి వాటి ఆదాయాలనే ఇంకా ఎక్కువగా వాడాలన్నారు.

### రాబోయే ఎన్నికలకు నాంది ప్రస్తావనలు

శ్రీ కామరాజది ప్రజాభిప్రాయాన్ని గ్రహించ టంలో పెద్ద దిట్ట. రాబోయే ఎన్నికల బాధ్యత ఉద్ఘాటనలని ఎవరూ పట్టించుకోనలేదు.

ప్రస్తుతం దేశం శ్రీ లాల్‌బహదూర్‌ని నమ్ముకుని ఉంది. ఈ నమ్మకాన్ని పూర్తిగా తీసుకుని ఆయన ఎంతో చేసి ఉండవచ్చు. ఏమీ చేసినట్లు కనిపించదు. అన్నీ అలా గాలికి కొట్టుకుపోతున్నట్లున్నాయి.

మంత్రివర్గాన్ని పునర్నిర్మించ లేదు. ఏ విషయంలోనూ గట్టిగా ప్రవర్తించటం లేదు. దుర్గాపూర్ ఆయనకొక నూతనావకాశం ఇచ్చింది. వెంటనే మంత్రివర్గంలో మార్పులు తీసుకురావాలి, ముందేమి రానున్నదో చూడాలి! ★

# 'మేనేజింగు ఏజన్సీ' లోపాలు: కేంద్రమంత్రి అసహాయస్థితి

మొగశైన కార్యకలాపాలు గూడ ఇటీవలి రోజుల్లో మరీ అభ్యంతరకరంగా రూపొందుతున్నాయి

మేనేజింగ్ ఏజెన్సీ విధానానికి పూర్తిగా తిలోదకాలు అర్పించాలనే భావంతో కేంద్ర ప్రభుత్వం ఇటీవలనే కొందరు ఆర్థికశాఖ కార్యదర్శులతో కమిటీ నొకదాన్ని ఏర్పాటు చేసింది ఈ కమిటీ సూచన ప్రకారం 1965 తో పదవీ కాలాన్ని పూర్తిచేసే మేనేజింగు ఏజెంట్లకు తిరిగి 5 సంవత్సరాలపాటు పదవీ కాలాన్ని ఇవ్వరాదు తృతీయ ప్రణాళిక, మేనేజింగ్ ఏజెంట్ల పదవీకాలం ఒకే మారు ముగిసేవిధంగా క్రొత్త ఏర్పాట్లను జరుపుకోవాలి 1966 తో పదవీకాలం ముగిసే వారికి గడువు మళ్లీ పొడిగించకూడదు

ప్రభుత్వం గూడా ఈ సమస్యను పరిష్కరిస్తున్నది ఈ సమస్యలను మళ్లీ పునఃపరిశీలించాలనే అభిప్రాయం గూడా ఒకటి లేకపోలేదు కేంద్ర ప్రభుత్వపు ప్రధాన ఆర్థిక సలహాదారు డాక్టర్ ఐ జి పటేల్ అధ్యర్యాన ఏర్పాటైన పరిశీలక సంఘం ఇందుకు కొనసాగుతూనే యున్నది

## పునరుద్ధరణ

పెట్టుబడి మార్కెట్టుకు పూర్వావసం సంక్రమించి కొంత అభివృద్ధిని సాధించాలనే ఆర్థిక మంత్రి పథకానికి కొందరు సహాయంగా ఉన్నా మరి కొందరు మాత్రం సరేనని తలూపారు ఈ సమస్య చాలా సూక్ష్మమైనది అసలు ఈ పెట్టుబడి మార్కెట్టును పునరుద్ధరించవలసిన ఆవశ్యకత ఎంతవరకు ఉన్నదా అన్నదే ప్రస్తుత అంశం ఆ మాట కొస్తే అసలు పెట్టుబడి మార్కెట్టు కార్యకలాపాలు ఎందుకింత స్తంభించిపోయాయా అన్నది గూడా సమస్యే గత రెండు పంచవర్ష ప్రణాళికల్లో కాంగ్రెసు ప్రభుత్వము ధర్మమా అంటూ పన్నులమీద పన్నులు సామాన్యుణ్ణి మరీ క్రుంగదీశాయి దీనికితోడు కాంగ్రెస్ ప్రజాస్వామిక సోషలిజం కూడా భారతదేశపు ఆర్థిక అభ్యుదయానికి తోడ్పడలేకపోయింది కమ్యూనిస్టులను వెనక్కు నెట్టాలనే కాంగ్రెస్‌వారి తృష్ణ భువనేశ్వర్ తీర్మానం అన్ని కలియటంతో కాలిన గాయంమీద కారం చల్లినట్లయింది పెట్టుబడిదారులకు ఎట్టకేలకు ఆర్థిక పరిస్థితిలో మాంద్యం ఏర్పడింది

## ఆర్థికమంత్రి పదవి

ఒక్కోమారు, ఈ తప్పిదానికంతా కేంద్ర ఆర్థిక మంత్రిని నిందించి ప్రయోజనం లేదు అనిపిస్తుంది ఒక వైపున అభివృద్ధి పథకాల కోసమైతే నేమి, రక్షణ అవసరాల కోసమైతే నేమి పన్నుల ద్వారా డబ్బును సృష్టించవలసిన బాధ్యత ఆర్థికమంత్రిది ఇంట్లో పోరు కూడా తానే వినాలి. బైటనుంచి చూసేవారికి మనము ఎల్లదొక్కుకున్నామనే అభిప్రాయం కలగాలి పర్త్రక్రేటీ చూపే అనహంకారానికి కూడా మార్గమాలోచించాలి అధిక ధరలు, నల్లధనము సమస్యలు విస్తృతంగానే వున్నాయి

**ఏ దేశంలో నైనాసరే ఆర్థిక మంత్రి అనే వ్యక్తి అందరి మెప్పు పొంద లేడు దానికి కారణం ఎవరికీ ఇష్టంలేని పన్నులను అతనే విధిస్తాడు!**

—శ్రీకృష్ణ ★

# ఢిల్లీనగరంలో ఒకేరోజు రెండు హత్యలు!

**ఢిల్లీ మహానగరంలో ఒకనాటి రాత్రి సిటీపోలీసు శాఖవారు ఒక ఇంటిముందు కారు ఆపి, సరాసరి లోపలికెళ్లి, ఆ ఇంట్లో పనిచేసే నౌఖరుని అరెస్టుచేశారు నౌఖరు కూడా పసివాడే, పదిహేను సంవత్సరాల వయస్సు కలవాడు.**

అంతకుక్రితమే ఆ ఇంటి యజమానురాలు, మిస్ ప్రియాసూద్ ఆ ఇంట్లో ప్రాణం లేకుండా పడి ఉన్నది దార్యాగంజ్‌లోని ఒక స్కూలులో మిస్ సూద్ ఉపాధ్యాయిని!

మిస్ సూద్ మృతి, నౌఖరు అరెస్టు— ఈ రెండు సంఘటనలు జరిగాక ఢిల్లీ నగరమంతా ఆ రాత్రికి రాత్రే వదంతులతోనూ, అనుమానం తోనూ హోరెత్తిపోయింది సూద్ హత్యకు నౌఖరు ఎంతవరకు బాధ్యుడయి ఉంటాడన్నదే పోలీసుల అనుమానం _

పోలీసులు ఆ అబ్బాయిని నిలేసి అడిగారు— ఏమిటీ ఈ ఘోరమని! మొదట్లో తనకేమి తెలీదన్నాడు ఆ అబ్బాయి ఒక రాత్రప్పుడు ఎవరో దొంగలొచ్చి 'అమ్మగార్ని' చంపేశారన్నాడు పోలీసులు మరికొంత దబాయించేసరికి, అమ్మగారిని చంపేసింది తనేనని చెప్పాట్ట ఆ అబ్బాయి పోలీసులకు

గోల్ మార్కెట్టు ఆఫీసు సమీపంలో ప్రియాసూద్ తన ఇంట్లో ప్రాణహీనంగా పడి ఉండటం ఆ మర్నాటి ఉదయమే పోలీసులు చూడగలిగారు మొత్తంమీద శవ పంచాయితీ ప్రకారం ఈ మరణం హత్యా ఫలితమేనని, ఈ హత్య గొంతు నులిమివేయటం ద్వారా జరిగిందని తేల్చిచెప్పటం జరిగింది

ఇంతలో డిప్యూటి ఇన్‌స్పెక్టరు జనరల్ శ్రీ యం సి సింగ్ కథనం ప్రకారం తానే హత్య చేసినట్లు నౌకరు ఒప్పుకొన్నాడట మిస్ సూద్ తనను మొదట్నించీ చాలా నీచంగా చూస్తున్నది, తాను దీంతో విసిగిపోయి హత్యకు పాల్పడ్డానని ఆ కుర్రాడు అన్నాడట

పోలీసు అధికారి శ్రీ సింగ్ ఇక్కడ మాట్లాడుతూ "ఆ అబ్బాయి (నౌఖరు) కొంత ఉద్రేక స్వభావ తత్వం కలిగినవాడు అయినా, ఎంతో తెలివైనవాడు" అన్నాడు తన యజమానురాలయిన మిస్ సూద్‌ను భయపెట్టేందుకు అతను "దయ్యం" వేషంలో ఆమె వద్దకు వెళ్ళాడట పైగా, తాను దేవీ స్వరూపాన్నని, ఇకముందు నౌకరును (తనను) ఏమీ తిట్టవద్దని అన్నాడట గొంతు పట్టుకొన్న మిస్ సూద్ వెంటనే ఆ అబ్బాయిని తన్నింది ఆ అబ్బాయి కూడా తిరగబడటం, పెనుగులాట తప్పనిసరి అయిపోవటం జరిగింది చివరకు ఆమె మరణించింది ఆ అబ్బాయి తల మీద కూడా గాయాలు కనుపించాయి ఆ గాయాలను దాచిపెట్టాలని ఆ అబ్బాయి ఎంతగానో ప్రయత్నించాడు కాని ఆ పని చేయలేకపోయాడు

"ఈ స్థితిలో నువ్విక్కడనుంచి ఎందుకు పారిపోలే"దని పోలీసు అధికారిసింగ్ అతణ్ణి అడగ్గా, "నే పారిపోతే నేరం చేసినట్లు మీరు నన్నే అనుమానిస్తారు" అన్నాడా అబ్బాయి

మిస్ సూద్‌తోనే ఉంటున్న ఆమె సోదరి, అంతకుక్రితం రోజే సాయంత్రమే బైట వెళ్ళింది మరెక్కడో వున్న ఆమె సోదరుడు కూడా అప్పటికప్పుడే ఢిల్లీ చేరుకున్నాడు

మరొక విచిత్రం: మిస్ సూద్ మరణించిన ఇరవై నాలుగు గంటలలోగానే కెనాట్ ప్లేస్‌లోని ఒకానొక రెస్టారెంటు చౌకీదారు కూడా హత్య గావింపబడ్డాడు

రెండు హత్య కేసులకు బాధ్యులయిన వారెవరో పోలీసులకు తెలిసినట్లే అనిపిస్తున్నది

"ఈ రెండు హత్యల ఆచూకీ తెలియటానికి ఎన్నో ఆధారాలు సిద్ధంగా ఉన్నాయి హంతకులను అరెస్టు చెయ్యటానికి ఎంతో కాలం పట్టదు" అన్నారు శ్రీ సింగ్!

వివరాలు వేచి చూడాలి!

ప్రారంభం:



గంటలు మ్రోగటం ఆరంభించగానే, ఆమె ఆ రాత్రి విచిత్రంగా ప్రవర్తించటం ప్రారంభించింది అందుకు కారణం ఏమయివుంటుంది?

## విచిత్ర కథలు-1

# మ్రోగే గంటల మర్మం

కథనం: ఆర్. టి. కూపర్

1834 ఫిబ్రవరి రెండో తారీఖున మేజర్ ఎడ్వర్డ్ మూర్ తన సాయంకాలపు చర్చి సేవ ముగించుకుని యింటికి తిరిగి వచ్చేసరికి పనివాళ్ల కేకలు కోలాహలంగా వినిపించినయి

వారిలో ఒకడు మేజర్ దగ్గరగా వచ్చి 'అయ్యా తమరు వెళ్లిన తర్వాత వంట గదిలోని గంట మూడుసార్లు మోగింది తీరా అక్కడికెళ్ళి చూస్తే ఎవరూ లేరు! చాలా విచిత్రంగా ఉందం'' టూ చెప్పాడు

మేజర్ కూడా ఆశ్చర్యపడ్డాడు కాని దానికి కారణం చాలా చిన్నదై ఉండవచ్చునన్న ఊహతో ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు

ఆ మర్నాడు స్వయంగా మేజరే ఆ గంట వినటం తటస్థించింది.

మళ్లీ మూడో రోజు కూడా అకారణంగా గంట మ్రోగటం మేజర్ గమనించాడు.

ఆ రోజు మేజర్ అయిదింటికి యింటికి తిరిగి వచ్చేసరికి పనివారంతా వేరుగా అతన్ని సమీపించి —అతను ఇంట్లో లేని సమయంలో ఒకదానికి ఇంకోదానికి మధ్య పదిహేను నిమిషాల వ్యవధితో అయిదుసార్లు గంట మ్రోగినట్లు, అక్కడ తాము తప్ప వేరెవ్వరూ లేనట్లు చెప్పారు

వాళ్ల మాటల్ని నిజమని రుజువుచేస్తూ గంట మళ్లీ మోగటం మొదలుపెట్టింది

మేజర్ దాని అంతేమిటో తేల్చుకోవాలని వెంటనే పరిశోధనకి పూనుకున్నాడు

అతడు త్వరగా ఆ గంటలున్న వంటగది వైపు పరిగెత్తాడు వంటగది కెళ్లి గంటల్ని జాగ్రత్తగా పరిశీలించాడు అక్కడ ఉన్న మొత్తం పన్నెండు గంటల్లో తొమ్మిది ఒకే వరుసలోనూ, మిగతా మూడూ కొంచెం ఎడంగానూ ఉన్నయి అందులో అయిదు గంటలు మాత్రం మ్రోగినయి. అదే మేజర్ గమనించిన విషయం

మేజర్ మూర్ వాటికి యింకా దగ్గరగా వెళ్లాడు. జాగ్రత్తగా పరీక్షిద్దా మనుకున్నారు కాని వెంటనే వెనుకడుగు వేశాడు విభ్రాంతితో!

గంటలు క్రిందటిసారి కంటే తీవ్రంగానూ, తమ స్థానాలనుండి ఊడిపడతాయేమో నన్నంత వేగంగానూ కొట్టుకోసాగాయి పనివారందరూ యిదివరకటికంటే ఎక్కువ భయభ్రాంతులైనారు. ఏమ్మాత్రం లక్ష్యపెట్టకుండా ముందుకు దూకిన మేజర్ ఆ సంఘటనతో [illegible]యాడు.

ఆ తర్వాత మూడు గంటలపాటు ఆ గంటలు అలా మ్రోగుతూనే ఉన్నయ్

ఆ మర్నాడు ఆ గంటల మ్రోత భరించరానంతగా తయారయింది ఒక్కొక్కప్పుడు ఇంట్లో గంటలన్నీ ఒకేసారి జోరుగా మ్రోగేవి ఆ సమయంలో మేజర్‌మూర్ అతని పనివాళ్లే కాక ఆ విచిత్రాన్ని చూడటానికి వచ్చిన యితరులు కూడా ఉన్నారు

చివరికి చెవులు బద్దలయేలాగా గంట మోగటం మొదలయింది గంటల్లో ఒకటి ఇంటి పైకప్పును కొట్టుకొనే విధంగా అటూ యిటూ ఊగటం ప్రారంభించింది

ఆ మరుసటిరోజు గంటలు అసలు మ్రోగనే లేదు

ఆతర్వాత ఆరు వారాలదాకా కొద్దిగానూ, తక్కువ శబ్దంతోనూ వినిపించేవి అదే ఆఖరన్నట్లు అప్పటికి మేజర్‌కి వాటినుంచి శాంతి లభించింది

జరిగిన విషయాన్ని వివరిస్తూ మేజర్

**మానవ మేధస్సు కందని విచిత్రాలు శాస్త్ర విజ్ఞానం ఎంతో ముందంజ వేసిన యీనాటికి కూడా జరుగుతూనే ఉన్నాయనేది నిర్వివాదాంశం. ఆ విధంగా జరిగే సంఘటనలకు ప్రత్యేకమైన కారణాలేమీ లేక పోగా ఫలితం మాత్రం తీవ్రంగా ఉండటం కనిపిస్తుంది. ఇలాటి సంఘటనలు, వాటివల్ల కలిగిన దుష్ఫలితాలూ ఆర్. టి. కూపర్ ఆరు కథల్లో పొందుపరచారు. అందులో మొదటిది ఈ 'మ్రోగేగంటల మర్మం.'**

మూర్ ఒక స్థానిక వార్తాపత్రికకు వ్రాశాడు. అది ప్రచురించిన వెంటనే అతనికి చదువరుల నుంచి చాలా ఉత్తరాలూ, తద్వారా సలహాలూ వచ్చాయి. అలా జరగటానికి కారణం ఏదో సామాన్యమైనదే అయివుంటుందని పాఠకులు తమ అభిప్రాయాల్ని వెలిబుచ్చారు.

ఎలుకలో, చిట్టెలుకలో గంటలకు సంబంధించిన తీగెలను పాడుచేసి ఉంటాయని, లేక ఎవరో తమాషాకి అలా చేస్తూ ఉండి ఉంటారని అభిప్రాయాన్ని తెల్పుతూ మేజర్‌కి ఉత్తరాలు వచ్చాయి.

కానీ, ఆ లేఖలు వ్రాసినవారు వారి కాలాన్ని వృథా చేసుకున్నారేమో ననిపించింది. మేజర్ మూర్ అంతకు పూర్వమే ఆ గంటలకి సంబంధించిన యంత్రాంగాన్నంతా అవకాశ మున్నంతవరకూ పరిశోధించి చూశాడు. అంతటితో ఆగక తన ఇంటిని గూడా అమూలాగ్రంగా శోధించాడు తగిన కారణం ఏమైనా దొరుకుతుందేమోనని. తమాషాకి ఏ తుంటరో ఆపని చేస్తున్నాడేమోనని కూడ ఒక కంట కనిపెట్టే ఉన్నాడు. ఏమీ ఫలించలేదు. ఈ రకమైన ప్రత్యక్షానుభవాలతో విసుగెత్తిన మేజర్ అదేదో మానవాతీతమైన శక్తి ప్రేరణ అని తీవ్రంగా సందేహించాడు కూడా!

మేజర్ మూర్ అదేదో గమ్మత్తయిన విషయమై యుంటుందని భావించాడు, కానీ దానికి సమాధానం అతనే చెప్పుకున్నాడు— "నేను యిన్ని సంవత్సరాల ప్రపంచ యాత్రలో చాలా గమ్మత్తులు, విచిత్రాలు, చూశాను. ఇదే గమ్మత్తయితే ఇదివరకటివాటి కంటె ఎంతో గొప్ప విచిత్రమని నిజంగా నమ్ముతాను."

ఆవిధంగా మ్రోగే గంటల మర్మం ఎవ్వరికీ అర్థంకాలేదు. బహుశః ఈ అంతుబట్టని చేష్టలకి దయ్యాల కారణమని, వాటి ఆనందంకోసం అలా చేస్తున్నాయన్న విషయాన్ని గట్టిగా ప్రతిఘటించాడు మేజర్ మూర్. ఆ సంఘటనలు అసహజంగానూ, అసామాన్యంగానూ ఉంటే ఉండొచ్చునేమోగానీ మానవాతీత శక్తుల చర్యలు మాత్రం కాదని మేజర్ నమ్మకం. తాను స్వయంగా, అనుభవం ద్వారా తెలుసుకోనిదే ఏ విషయాన్ని తేలికగా నమ్మలేడంటాడు మేజర్ మూర్ దృఢంగా.

అతని నమ్మకం సరైందేనా? అన్న ప్రశ్న మనకి ఎదురవ్వచ్చు! ఎందుకంటే ఆ గంటలు తీవ్ర సంచలనాన్ని కలిగించినయి కదా! అందువల్ల అది మానవాతీత శక్తి కాదనటానికి అవకాశంలేదు! ఒక మేజర్ ఇంట్లోనే గంటలు నిరపాయకరంగా మ్రోగినయ్యే కానీ కొన్ని కొన్నిచోట్ల వాటివల్ల మరణాలూ, కష్టాలూ కలిగిన మాట మాత్రం వాస్తవం!

ఇస్‌లింగ్‌టన్‌లో 1825 ఫిబ్రవరిలో గంట మధ్యమధ్య చిన్న వ్యవధులతో దాదాపు రెండున్నర గంటలు మోగింది. అది విని అక్కడ పనికత్తె భయావహంగా కేకవేసి క్రిందపడి కొట్టుకోడం మొదలెట్టింది. ఎగిరెగిరిపడే ఆమెను అదుపులోకి తీసుకురావటానికి అయిదుగురు మనుష్యుల సహాయం అవసరమైంది.

భయంకరమైన ఆ స్థితిలో ఆమె పద్దెనిమిది గంటలు ఉంది. ఆతర్వాత కూడా ఆమె స్థితి కొంత మెరుగైనా వారం రోజులు నిద్రాదేవి వడిలోనే గడిపింది.

ఇక్కడ ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే— ఆమె తెలివితప్పి పడిపోగానే గంటల వాటంతట అవే ఆగిపోవటం. ఇది మానవాతీత శక్తి ప్రేరణ కాదనటానికి కెలా వీలవుతుంది! దీన్ని మామూలు విషయంగా ఎలా తీసుకోగలం?

తర్వాత నార్‌ఫోక్‌లో ఇంకో సంఘటన జరిగింది. ఒక మనిషి శారీరక అస్వస్థతతో మంచంలో ఉన్నాడు. ఉన్నట్టుండి గంట మోగటం మొదలైంది. అతని యింట్లో. వెంటనే పనికత్తె పైనున్న అతని గదికి పరుగెత్తికెళ్ళి "మీరు గంట మోగించారా" అనడిగింది.

అతడు ఉలిక్కిపడాడు. తర్వాత ఆమెవంక చూస్తూ "నేను గంట కొట్టలేదే" మళ్ళీ అంతలోనే తీవ్రంగా సమాధానం చెప్పాడు. "నాకేం అవసరంలేదు. నే నెందుకు గంటకొడ్తాను?"

అంతే అవే అతడు పలికిన ఆఖరి మాటలు. అర్ధరాత్రి పన్నెండయేసరికి అతని జీవితమే అంతరించింది.

ఇంకోచోట—ఇద్దరు మగవాళ్ళ నర్సులు ఒక శవానికి కాపలాగా ఉన్నారు. కుర్చీల్లో అలా కునుకు తీస్తుండగా ఎవరో త్వరగ వడిచవస్తున్న అలికిడి విని జాగ్రదావస్థలోనికి వచ్చి చూశారు. తీరా చూస్తే, పనికత్తె తలుపుతెరచి "ఏమైంది" అని గొణిగింది భయంగా శవంపైపు చూస్తూ.

"గంట ఎందుకు కొట్టారు?" అనడిగింది.

కానీ, ఆ నర్సులు మాత్రం గంట కొట్టనే లేదు. అయినా రెండోసారి వంటగదిలో మళ్ళా గంట వినిపించింది.

ఇలాంటి సంఘటనే యింకొకటి జరిగింది.

జబ్బుగా ఉన్న ఒకామె గదిలోనుంచి గంట విన పడటం జరిగింది. ఇంట్లోవా రందరికీ అది ఎలా మ్రోగిందో అర్థంకాలేదు. అది అలాగే నెల రోజులకు పైగా కొనసాగింది. ఆమె చనిపోయింది. వెంటనే గంటలు కొట్టటం ఆగిపోయింది. కానీ ఆమె భర్త ఆ గదినుంచి బయటకి రాగానే గంటలు మళ్ళీ మొదలెట్టాయి.

కొన్ని నాళ్ల అనంతరం అతను కూడా కన్ను మూశాడు. తర్వాత కొద్దిసేపటికే గంటలు తిరిగి మోగసాగాయి కానీ పూర్వం అంత జోరుగా మాత్రం లేవు. తర్వాత మళ్ళీ మామూలుస్థితి కొచ్చాయి.

ఈ సంఘటన లన్నిటికీ కారణం ఏమై ఉంటుంది?

ఈవిధమైనా అంతుబట్టని గంటలమోత కేంబ్రిడ్జ్ రామ్స్‌గేట్, బ్లవేథన్, లిట్ వేర్స్‌లోనూ, ఇంకా ఇతర చోట్ల కూడా వినిపించింది.

ఛెస్టర్‌ఫీల్డ్‌లో ఒకతను గంటల తీగలను సవరిస్తుండగా అందులో ఒకటి ఎవరి ప్రమేయం లేకుండా మోగటం ప్రారంభించింది. ఆ దెబ్బతో అతను నిచ్చెనమీద నుంచి ఒక్కసారిగా క్రిందపడి "ఆ గంటల్లో దయ్యం ఉంది" అని వాపుకేక పెట్టి ప్రాణాలు విడిచాడు.

గ్రీన్‌విచ్‌లో ఇంతకుమించి ఆశక్తికరమైన దింకోటి జరిగింది. లెఫ్టినెంట్ రివర్స్, అతని కుటుంబం ఉంటున్న ఆస్పత్రిలోని ఒక విభాగంలో ఒక రాత్రి వేరే గదినుంచి గంటలమోత వినపడింది. వాళ్ళు ఆశ్చర్యపోయారు. అంతలోనే మరొకటి కూడా మోగటం మొదలెట్టింది. ఆతర్వాత అన్నీ కలసి పిచ్చిగా ఏకధాటిగా మ్రోగసాగాయి.

తన నవలా సాహిత్య పరిచయంతో లెఫ్టినెంట్ తగిన కారణం కోసం మొండంలాగా అన్వేషించాడు. కానీ అసలు కీలకాన్ని కనిపెట్టలేకపోయాడు. ఆ గంటల నాలుక (బెల్ క్లాపర్స్) లను కట్టివేశాడు. కానీ, వాటంతట అవే విడిపోయి మళ్ళీ యథాప్రకారంగా మోగసాగినయ్. లెఫ్టినెంట్ గంటలను బాగుచేసేవాడినీ, అక్కడ ఆ శాఖకు సంబంధించిన గుమాస్తానీ, సైంటిస్టునీ సాయంగా తీసుకున్నప్పటికీ వారివల్ల కాలేదు. అతడు కూడా ఆ విభాగా లన్నింటినీ శోధించి నిశితంగా పలుమార్లు పరీక్షించినా ఫలితం దక్కలేదు. అతని కుటుంబం ఇక ఒక్క క్షణం కూడా అక్కడ ఉండటానికి నిరాకరించింది.

ఆవిధంగా ఆరంభమైన ఆ గంటల శబ్దం వారం రోజుల తర్వాత ఏ ప్రమాదమూ తెచ్చిపెట్టకుండానే ఆగిపోయింది. ఇది మరొక చిక్కుప్రశ్న.

ఓ యింటి యజమానిని ఈ గంటలమోత అమితంగా చికాకు పరచింది. గంటలు పూరికే కొట్టుకోడమే కాకుండా వాటితోపాటు అతని పియానో కూడా అదంతటదే ఎవరో వాయిస్తున్నట్లు మోగటం మొదలెట్టింది.

ఛెల్టెన్‌హామ్ దగ్గరున్న గ్రాస్టబరీ అనే పల్లెలో గతంలో జరిగినవాటి కంటే ఆశ్చర్యకరమైన సంఘటనే జరిగింది. ఆ పల్లెలో ఉన్న చర్చి గంటలు, గంట కొట్టేవాడి ప్రమేయం లేకుండానే మూడు గంటలసేపు మోగినయి. అవి చివరికి ఆగిపోయేసరికి చర్చి గడియారం మూడువందలసార్లు కొట్టింది.

(ఇంకా ఉన్నాయి)

సుందర్రామయ్య వాలుకుర్చీలో వాలుకుని ఉన్నాడు. కళ్లు మూసుకుని ఉన్నాడు. నిద్ర పోతున్నట్టు ఉన్నాడే కాని అతని మనస్సు మాత్రం నిద్రపోవటం లేదని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఎందుకంటే, ఎన్నడూ లేనిది, ఈ మధ్య సుందర్రామయ్య గుండెల్లో దిగుళ్లు గుళ్లు కట్టుకోవడం ప్రారంభించాయి. సంసారమూ, పిల్లల చదువులూ, అప్పుల వాళ్ల దబాయింపులూ, వీళ్ల ఎద్దడి, ఫెయిర్ ప్రైస్ షాపుల ముందు క్యూలూ, పంచదారం కటకటలూ అతన్ని కొంతవరకూ ఎన్నడూ బాధింపజేయలేదు. అందరు మంచివాళ్లకీ ఉన్నట్టే ఈ 'ఈతి బాధలు' తనకీ ఉండడంలో అసహజత ఏమీ లేదని నమ్మిన వాడతను. అలాంటిది లేకపోతే మనుష్యుల నైతిక శక్తి బలపడదని కూడా ఒకప్పుడు విశ్వసించాడు. ఆ విశ్వాసం బలంగా ఉన్నవాళ్లూ అతను ఎన్నడూ వెన్ను వాల్చి ఎరగడు. కళ్లు అరమోడ్చి తనలోకి తను వాల్చి ఎరగడు. కళ్లు అరమోడ్చి తనలోకి తను చూసుకుని ఎరగడు తాను నడిచే బాటలో పక్కకి తప్పుకుని ఎరగడు చూపు చెదరలేదు. అడుగు తడబడలేదు. గుండె అదరలేదు. కన్నీరు కారగి లేదు. అటువంటి సుందర్రామయ్య ఈ ప్రపంచ మంటే నాకేం లెక్క, అన్నట్టు తల ఎగరవేసిన సుందర్రామయ్య, ఇప్పుడు ఏ ప్రపంచంలో మునిగి పోయాడో ఎవ్వరికీ తెలియదు.

అందుకు కారణం ఒకటుంది, చాలా చిన్నది. అదేమిటంటే—

సుందర్రామయ్య పొద్దున్నే లేచి, దంత ధావనకి బ్రెంకపుల్ల తీసుకుని, దొడ్డి వైపు గోడ పాదుదగ్గర బండ మీద కూర్చుని ఉన్నాడు ఆ బండ అక్కడ, సరిగ్గా ఎనభై ఏళ్ల నుంచి ఉంది. తన తాతగారు వేయించారు ఆ బండ వేయించక ముందు ఆ దొడ్డి కూడా తమరి హక్కు భుక్తంలో ఉండేది కాదు. అన్నాబత్తుల పున్నయ్యగారిది.

ఆయనగారు బహుదొడ్డ మనిషేనని చెప్పుకునే వారేకాని, తన తాతయ్య మాత్రం బహు చెడ్డ మనిషి అని చెప్తూ ఉండేవారు. అదయినా ఆయన చివరి రోజుల్లో. ఎందుకంటే, ఈ దొడ్డి, దీనికి వెలపల దడి అవతల ఉన్న దొడ్డి ఆ రోజుల్లో ఏక ఖండంగా ఉండేదట. రెండు ఇళ్లవాళ్లూ ఉమ్మడిగా వాడుకునే వారు. కొన్నాళ్ల అల్లా గడిచాక, వీళ్ల దొడ్లో తిరుగుతూండే పెంపకపు కుక్క ఒకటి వాళ్ల వంటింట్లోకి దూరి ముసలమ్మని ముట్టుకుందని అన్నాబత్తుల పున్నయ్య పోట్లాట కొచ్చాడు. పోట్లాట కొచ్చినవాడు తన వాదన కుక్కతో సరిపెట్టకుండా కుక్క పెంపకం దార్ల మీద కూడా విరుచుకు పడ్డాడు. దాంతో తాతయ్యకి చిర్రెత్తుకొచ్చి, 'నా దొడ్లో అడుగెట్టావో, ముక్కలిరగదంతా''నని హుంకరించాడు. అంతే మాటా మాటా పెరిగింది. ఈ దొడ్డి నీది కాదంటే నీది కాదనుకున్నారు. మున్మాటికీ వాదే నన్నాడు అన్నాబత్తుల పున్నయ్య అయితే రిజిస్టరీ పత్రాలు పట్టావున్నాడు తాతయ్య "సీకొందు'కని రెట్టించడు పున్నయ్య. ఉంటే తేవోయ్! చూస్తా నీ సంగతి!' అన్నాడు తాతయ్య పున్నయ్య తేలేదు. లేవు కనక తేలేదన్నాడు. తాతయ్య "అయితే చూసేదేనా తాతయ్యా?' అని అడిగాడు తను 'నీకు తెలీదు నువ్వూరుకోరా!' అని కూకలేశాడు తాతయ్య. యాతావాతా, అది వాళ్లిద్దరిదీ కూడా కాదనీ, పూరు ఉమ్మడి 'వడవ' అని తరవాత లాయర్ల వాస్తలో అంటూండగా విన్నాడు తను కనక అన్నాబత్తుల పున్నయ్యతో ఆడించకూడా ఉండేటందుకుని దొడ్డి నడిమధ్యన పెద్ద బండరాయొకటి తెప్పించి వేయించాడు. ఆ ప్పుడింటి మీద కాకి ఈ రాయి దాటొస్తే పిచ్చడి చేస్తానని హెచ్చరించాడు. అప్పట్నించి ఈ రాయే రెండిళ్ల వాళ్లకీ సరిహద్దుగా నిర్ణయమయింది అన్నాబత్తుల పున్నయ్య, దంచిందే దక్కుడన్నట్టు నోరు మెదపకుండా ఊరుకున్నాడు కుక్క ముట్టుకున్న ముసలమ్మ మాత్రం చచ్చేనాటి దాకా తాతయ్యకి శాపనార్థాలు పెడుతూనే ఉండి. ఏమో ఈ లావా, దేవిలో అసలు రహస్యం ఏమిటో ఎవరికీ తెలియదు.

తాతయ్య పోయిన తరవాత రెండేళ్లకి ముసలమ్మా పోయింది తరవాత, అన్నాబత్తుల పున్నయ్యా నాన్నా సయోధ్యగానే ఉంటూ వచ్చారు ఒక రోజున హఠాత్తుగా పున్నయ్య కీర్తిశేషుడయాడని ఒకే ఒక కూతుర్నీ, ఒక కొడుకునీ పెద్దవాళ్లు చేసేసి. కొడుకు ఎక్కడో కోమటి గుమాస్తాగా కుదిరడు. కూతురు, సుశీల, అప్పటికింకా చిన్న పిల్ల.

పున్నయ్య పోవడంతో నాన్నకి కూడా ఇహ ముందు ఆశ తక్కువై పోయింది. ఏమో, ఎప్పుడు ఆవరించేస్తాడో ఎవడు చెప్పగలడు కనకా, అన్నంత పరధ్యాన పట్టుకుంది. అందుకని ఇహముందు చేసుకోవలసిన పనులన్నీ పూర్తిచేసుకుని మరీ ఆవులిస్తే బాగుంటుందని కోరుకున్నవాడై భూమి పుట్రా యావత్తూ పిల్లనామా క్రింద దఖలు పరిచేశాడు. అంతటితో తృప్తి లేక, మూలపొలంలో రెండు, కొత్తపల్లి కొబ్బరి మామిడి అంట్లు తెప్పించి వేయించాడు, ముందు ముందు పిల్ల కాయలు ఎవరైనా తన పేరు చెప్పుకుని అనుభవిస్తారని. అయినా ఇంకా తను చెయ్యవలసిన పని ఏదో కొరత పడట్టు భావించి, ఒక రోజున హఠాత్తుగా పారా, గడ్డపారా తీసుకువచ్చి దొడ్లో దడికట్టడం ప్రారంభించాడు. 'ఎందుకు నాన్నా, నీకీ శ్రమ!' అని తను అంటే విన్నాడు కాడు. ఏ ముహూర్తాన ప్రారంభించాడో కాని, ఆ దడి కట్టడం పూర్తి కాకముందే ఆ వేళ రాత్రి కాస్త చలిజ్వరం వచ్చి మంచం పట్టాడు. నాలుగు రోజులు తిరక్కుండానే కన్ను మూశాడు. ఆయన పోయిన పన్నెండో రోజున తను పాలేర్ని పిలిపించి దడి పూర్తి చేయించాడు. ఆ దడి దగ్గర బండ మీద కూర్చుని తను ఇప్పుడు దంత ధావనం చేసుకుంటున్నాడు. అక్కడ కూర్చున్నప్పుడూ ఈకథంతా జ్ఞాపకం వస్తూ ఉంటుంది.

ఇదంతా నెమరు వేసుకుంటూ, పుల్ల నములుతూ కూర్చున్న సుందర్రామయ్యని, బండకింద తేలు ఒకటి మెల్లగా వచ్చి అంట కొడిచింది. "ఎంత పని చేశావే, పీ దుంప తెగా!" అంటూ దాన్ని కాలితో తొక్కి, చంపబోతూంటే కోమలమైన స్త్రైన కంఠస్వరం ఒకటి వచ్చి అతన్ని ప్రయత్నాన్ని ఆపేసింది.

"మామయ్యా!"

సుందర్రామయ్య తలెత్తి చూశాడు.

సుశీల!

అన్నాబత్తుల పున్నయ్య కూతురు సుశీల. పిల్ల మంచి మిసమిస లాడుతూ ఉంది. చిన్నప్పుడు తను ఎత్తుకు తిప్పిన సుశీలే ఈ బంగారబొమ్మనా అని ముక్కు మీద వేలేసుకున్నాడు. సుందర్రామయ్య. అత్తారింటికి వెళ్లొచ్చిన తరవాత కాస్తంత వెవళికం తగ్గింది కాని, ఒకటొకం పెలివి కాదూ!

అలాంటి సుశీల ఈ మధ్య పుట్టింటికి వచ్చిన తరవాత మళ్లీ ఎందుకో పెన్నం వెళ్లింది కాదు. వాళ్లల్లో వాళ్లకి ఏమొచ్చాయో మరి, అత్తారింటిని గురించి ముచ్చటొస్తేనే చిర్రూ, బుస్సూ మంటూంది.

"ఏం సుశీలా! ఏమిటి విశేషం?" అన్నాడు సుందర్రామయ్య.

"ఏం లేదు మామయ్యా మీ మందార పూలు కోసి ఇస్తావేమోనని."

"ఏం? ఏ దేవుడికి పూజ్జేద్దామని?"

"వరాలిచ్చే దేవుడికి."

"ఏ వరాలో?"

"అపురూపమైన వరాలు మనస్సులో కోరటమే కాని పైకి ఇలా చెప్పం మామయ్యా."

"అబ్బో! గడుసుదానివే."

"ఆ పాటి వరాలు ఇవ్వగలిగిన దేవుడే అయితే మనస్సు తెలుసుకునే ప్రసాదించాలి." అంటూ కిలకిలా నవ్వింది సుశీల.

ఆ నవ్వు అలికిడి ఇల్లాలికి ఎక్కడ వినిపిస్తుందోనని సుందర్రామయ్య, ఆ మాటున మోహం తొల్చేసుకుని చేతులు కడుక్కుని, గబగబా పువ్వులు కోసి తెచ్చాడు దడి అవతలలి నుంచి సుశీల చేతులు చాపింది. దడి ఇవతలి నుంచి సుందర్రామయ్య వాటిని దోసిట్లో పోస్తూంటే సుశీల నవ్వుతూ

"ఏం మామయ్యా! నేను మూడు పువ్వులు చాలంటే ముప్ఫయ్ మూడు పువ్వులు ఇస్తున్నావే!"

"అధికస్య అధికం ఫలం— అని" అన్నాడు.

సుశీల మళ్లీ నవ్వింది. నవ్వుతూ ఇంట్లోకి వెళ్ల బోతూంటే సుందర్రామయ్య ఒక్క క్షణం అలానే నిల్చుండి పోయాడు.

అతను ఏది బాగుండ దనుకుంటాడో, సరిగ్గా అలాగే జరుగుతూ ఉంటాయి చాలా.

తన ఇల్లాలు కాస్తంత కరాఖండీ మనిషి. అటువంటి మనిషి చెవిన పడిన సుశీల నవ్వు ఆవిడని బయటికి లాక్కొచ్చింది.

"ఎవరండి అక్కడా?" అంటూ గుమ్మంలో నుంచి పిలిచింది.

"నేనే! ఏం?" అంటూ వెనక్కి తిరిగాడతను.

"ఇక్కడున్నారా మీరూ? ఇందాకట్నించి ఇల్లంతా వెతుకుతున్నాను."

"ఏం? ఏ మొచ్చిందేం?"

"ఏమొచ్చిందేమిటి? కాస్త మెల్లిగా అనండి."

అవతల, మునసబు గారి భావమరిది వసారాలో కూర్చుని ఉన్నాడు.

"మునసబు గారి భావమరిదా ? నా కోసం వచ్చాడా ?" అంటూ ఆశ్చర్యం వాపోయాడు సుందర్రామయ్య.

"ఆఁ ! మీ కోసమే వచ్చాడు. తొందరగా రండి. ఇంకా ఆలస్యమయితే బావుండదు"

"ఎందుకొచ్చాడు చెప్మా ?" అనుకుంటూ అతను వసారావేపు నడిచాడు.

ఆ వచ్చినతను ఎంతో వినయ విధేయతలున్న వాడిలా లేచి నిలబడి నమస్కారాదికాలు చేసి అతను కూర్చున్న తరవాత కూర్చుని, వచ్చిన విషయం మెల్లిగా చెప్పి, మీ సహాయం అన్నది లేకపోతే తమలాంటి వాళ్ళకి మనగడే లేదని చెప్పి పని పూర్తి చేసుకుని వెళ్ళాడు.

అతను వెళ్ళిపోయిన తరవాత ఇల్లాలు వచ్చి "ఏమిటంటి ?" అంటూ ఆరా తీసిన తరవాత సుందర్రామయ్య ఒక్కటొక్కటే ఆవిడకి చెబుతూ ఉంటే అప్పుడు తనకే అనుమానం వేసింది, ఏదో చిక్కులో పడబోతున్నానని. సరే, ఆవిడ కేదో సమాధానం చెప్పేసి, కాసేపు ఇటూ అటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. పైకి సామాన్యంగా కనిపించే విషయాల్లో కూడా లోతులు తెలిసినట్టయితే ఎంతో నిజం బయట పడుతుందని. తనంత వాడయిన వాడు తను కూడా తొందరపడి సప్పులో కాలేశానే అని నాలిక కొరుక్కున్నాడు. దిగాలుగా పడకుర్చీలో జేర్లబడ్డాడు.

సూరిగాడూ, పాప పక్కనే కూర్చుని హోం వర్కు చేసుకుంటున్నారు.

# రేఖా చిత్రం

సుందర్రామయ్య వాళ్ళవైపు చూడలేదు. తనలో తనే మురిగి పోయాడు. "ఛొరా, మునసబు భావమరిది తనచేత ఎంత పని చేయించాడూ !" అనుకున్నాడు.

అసలు ఆ వూరి మునసబుకీ, పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుకీ మధ్య మహా ప్రవాహమున్న సెలయేరులా భగ్గుమంటూ ఉంటుంది. వాళ్ళిద్దరికీ పూరువమ్మడి లావా దేవీల్లో చాలా ఘర్షణలు వచ్చాయి. కర్రలు కర్రలు కలిశాయి. వీళ్ళ వైపు నుంచి లేచిన కర్రలకి అవతలి వాళ్ళ రక్తం, అవతలి వాళ్ళ కర్రలకి ఇవతలివాళ్ళ రక్తం ఇచ్చి పుచ్చుకోవడాలు జరిగాయి. జరుగుతూ ఉండడం మామూలయింది ఆ వూరి పోలీసుస్టేషనుకి కొత్తగా బదిలీ అయి వచ్చిన సబిన్స్పెక్టరుకి ఆ మామూలు కిట్టలేదు, హుటాహుటిగా అక్కడికి వచ్చి దొరికిన వాళ్ళనందర్నీ వేల్లకుని లాక్కుపోయాడు. కేసు నమోదయింది. అందులో సాక్ష్యం చెప్పడానికి మునసబు భావమరిది సుందర్రామయ్య దగ్గిరకొచ్చి బతిమాలాడు. ఆ కొట్లాట జరిగినప్పుడు ఆయనగారు స్వయంగా అక్కడున్నాడు. అది తెలుసుకుని మునసబుగారు మనిషిని పంపించాడు. ముందు ఎవరు కర్రెత్తారన్న పాయింటు మీదకేసంతా ఆధారపడి ఉంది. అంటే సుందర్రామయ్య సాక్ష్యం మీద మొగ్గి ఉందన్న మాట.

ఊళ్ళో మునసబూ, పంచాయితీ బోర్డు ప్రెసిడెంటూ ఎదురెదురు ఇళ్ళ వాళ్ళమరి. అందుకే కాబోలు, ఎవరి అరుగుల మీద వాళ్ళు నిలబడి మీసాలు దువ్వుకుంటూ నువ్వెంత ? అంటూ మాటామాటా పట్టింపుగా పోయారు. అది ఇప్పుడు ముదిరింది. వాళ్ళిద్దరిలోకీ మునసబు కాస్తంత మెరుగని సుందర్రామయ్యకి ఎందుకో గుడ్డి నమ్మకం ఏర్పడింది. ఆఁ, అవును— ఏణ్ణర్థం క్రితం అనుకుంటాను సుందర్రామయ్య దొడ్డి పూరువమ్మడిలోదని పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు తగాదా తెచ్చాడు. అతను అన్న దల్లా కాదనడమే అలవాటయిన మునసబు సుందర్రామయ్య పక్షాన వాదించి కాస్తంత ఉపకారం లాంటిదేదో అనుకోకుండా చేశాడు. 'ఎవరేమను కున్నా, మునసబుగారు పాపం మంచివారేనండీ !' అన్నది ఒకసారి సుందర్రామయ్య ధర్మపత్ని. ఆవిడ ఒకసారి అన్నది అతని చెవివుల్లో పదిసార్లు మోగుతూ ఉండిపోవడం పరిపాటే. కనక, అతని హృదయంలో మునసబుగారికి కాస్తంత మెత్తని మూల' దొరికింది. అదేదో ఉండడం వల్లనేమో ఆయన గారి భావమరిది వచ్చి మరీ అంత జేపడి పోయిన వాడిలా మాట్లాడితే, 'సరే పొన్లెస్తూ !' అన్నట్టు మాటిచ్చేశాడు. అంటే, ఆ గొడవ జరిగిన రోజుకి మునసబు తాలూకు మనుషులు రచ్చబండ దగ్గిర ముచ్చట్లాడుకుంటూ ఉండగా ప్రెసిడెంటు తాలూకు వాళ్ళు వచ్చి వళ్ళ మీదకి కర్రలెత్తారన్నది కోర్టులో చెప్పవలసిన సాక్ష్యం తాలూకు నిర్దుష్ట పాఠం అతను వప్పగించాలి. తరవాత ఏమయినా అగుగాక, 'అన్నమాట నిల బెట్టుకోక పోతే తన పెద్దమనిషి తరహా ఏమయి పోవాలి ?' అయినా, ఒక పక్క మనస్సు పీకుతూనే ఉంది, 'అయ్యో ! అబద్ధాలు చెప్పేస్తున్నావే !' అని. సుందర్రామయ్య ఆలోచన ఎంతకీ తెగటం లేదు.

ఇంతట్లోకి సూరిగాడు, పాపరాసుకుంటున్న పుస్తకం పట్టుకుని నాన్న దగ్గిరికి వచ్చాడు.

"నాన్నా ! చెల్లి పుస్తకం చూడు. అన్నీ వంకర టింకర్లు రాస్తోంది" అంటూ ఫిర్యాదు చేశాడు.

పాప బెరుకు బెరుకుగా చూస్తోంది.

సుందర్రామయ్య ఇప్పుడు మేలుకున్నాడు. పాపని దగ్గిరికి పిలిచాడు.

"చూడు పాపా ! ఇల్లా అడ్డ దిడ్డంగా రాయకూడదమ్మా ! చక్కగా రూళ్ళ కర్రతో గీతలు గీసుకుని అందంగా రాయాలి." అన్నాడు.

పాప ఉడుకుమొత్తనంతో చూసింది.

"ఒరేయ్ ! సూరీ ! ఈ పుస్తకం అంతా చెల్లాయికి గీతలు గీసి పెట్టు ! గీతలు చెదిరి పోకుండా గీతలు తిన్నగా రాస్తే రాత ఎంతో బాగుంటుంది. పావరాత ముత్యాల కోవలా ఉంటుంది !" అన్నాడు సుందర్రామయ్య.

"నాకు వాడేం గీసి పెట్టక్కర్లేదు ! నా గీతలు నేనే గీసుకుంటాను !" అంది పాప బుంగ మూతి పెట్టి.

"సరేరా ! దానికిష్టం వొచ్చినట్టే కానియ్. ఎవరి గీతలు వాళ్ళు గీసుకుంటేనే మంచిది !" అన్నాడు.

సుందర్రామయ్య కుర్చీలో వెనక్కి జేర్లబడ్డాడు.

"అవును. ఒకళ్ళు గీటు మీద ఇంకొకళ్ళు నడవడ మేమిటి ? ఎవరికి కావలసిన వచ్చినట్టు



వాళ్ళు గీనుకోవాలి !" అనుకున్నాడు.

సుందర్రామయ్యకి కోపల్నించి పిలుపు వచ్చింది స్నానానికి లేచాడు.

నాలుగు రోజులు గడిచాయి. మేజిస్ట్రేటు కోర్టు నుంచి తనకు సమను వచ్చింది. ఇంకా రెండు రోజుల వ్యవధి ఉంది. ఇంతలోకే, మారి గాడి పెద్ద మావయ్య వచ్చి, "వండక్క అక్కయ్యని, పిల్లల్ని పంపించు బావా !" అని పట్టు బట్టాడు. "హమ్మయ్య ! కొన్నాళ్ళగా అవిడ గారి సాధింపులు తప్పుతాయిరా దేవుడా !" అనుకుంటూ 'సరే నన్నాడు. సరే వాళ్ళు వెళ్ళి పోయారు. వెళ్ళిపోతూ ఇల్లాలు, సుశీలని పిల్చి, "కాస్త మీ మావ గారిని వో కంట కనిపెడుతూ ఉండు కోడలా !" అని చెప్పి అప్పగింతలు పెట్టి మరీ వెళ్ళింది. సుశీల తేలిగ్గా నవ్వేసింది. సుంద ర్రామయ్య నవ్వలేక పోయాడు.

వాళ్ళు వెళ్ళిపోయిన మర్నాడు సుశీల వచ్చి సుందర్రామయ్యని, "భోజనానికి అక్కడికి వచ్చెయ్యండు మావయ్యా !" అని చెప్పింది.

"ఉబ్బే ! ఎందుకు లెద్దూ నీకు శ్రమా ! ఏ వేళకొస్తానో ఏమో ! ఇంట్లో నాలుగు మెతుకులు ఉడకేసుకుంటె అయిపోలా ?" అన్నాడు.

"చాల్లే ? నువ్వు ఉడకేసుకును రోజని నన్ను కూడా భోజనానికి పిలుద్దువు గాని కాని, ఈసారి మాత్రం నువ్వు మొహపడకు. అత్తయ్యగారు మరిమరీ చెప్పి వెళ్ళింది కూడా !"

"అవిడగారికేం ! ఎన్నయినా చెబుతుంది అన్నాడు.

"సరే, వంట వేళయింది. వస్తా. నువ్వు మాత్రం చెయ్యి కాల్చుకోవకు !"

"ఫరవాలేదు, వండేసుకోవచ్చు ! అని సుందర్రామయ్య అంటూ ఉంటె—

"భలే వాడివి మావయ్యా !" అంటూ నవ్వుతూ పరుగెత్తింది సుశీ. సుందర్రామయ్య చాలాసేపు అలానే చూస్తూ నిలబడి పోయాడు

ఇంట్లో ఈ పనీ ఆ పనీ చూసుకునే సరికి కోర్టు టైము గుర్తొచ్చింది. అదరా బాదరాగా బట్టలేసుకుని బయటికి పరిగెత్తాడు. మునసబు గారి బండి గుమ్మంలో సిద్ధంగా ఉంది.

సుందర్రామయ్య జీవితంలో మొట్ట మొదటి సారి కోర్టుకు వెళ్ళాడు. రామాయణం చేత బట్టుకుని ప్రమాణం చేశాడు— అబద్ధం చెప్పను. నిజమే చెబుతాను అని చెప్పాడు— మునసబు గారి భావమరిది చెప్పిన పాఠం పీసంపాటి హెచ్చుతగ్గులు లేకుండా చెప్పాడు. పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగారి మనుషులదే తప్పు తెలిసింది. వాళ్ళకి కఠిన శిక్షలు వేస్తూ, ప్రెసిడెంటు గారు వెయ్యి రూపాయలు నష్ట పరిహారం చెల్లించుకోవాలని తీర్పు చెప్పారట్

[illegible], మోహావేశంతో నవ్వుకున్నాడు. సుందర్రామయ్య భుజం తట్టాడు.

సుందర్రామయ్య దించిన తల ఎత్తలేదు.

సరిగ్గా మధ్యాహ్నం వేళయింది. మునసబు తరఫు వాళ్ళంతా కలిసి హోటల్లో భోజనం చెయ్యాలని నిశ్చయించుకున్నారు. ఆ వైపు నడుస్తున్నాడు. సుందర్రామయ్య, పేరస్తుడిలా మెల్లగా వెనకాల నడుస్తున్నాడు. ముందు నడుస్తున్న వాడల్లా, మునసబుగారు మెల్లగా ఇతని దగ్గరికి వచ్చాడు.

"సుందర్రామయ్య గారూ! నా పరువు దక్కించారు. మీ మేలు మరిచి పోలే. ఏదో, మాకు శక్తి ఉన్నంత వరకూ మీ అవసరానికి పనికొస్తూనే ఉంటాం. మీరు దయుంచితే చాలు." అన్నాడు.

"ఆఁ! ఏదో, దానికేముంది లెండి." అంటూ పళ్ళు నమిలాడు సుందర్రామయ్య.

"అమ్మమ్మా! ఎంత మాట! ఈ వేళ కేసంతా మీ సాక్ష్యం మీదనే నిలబడింది. మీ మాట అంటే, మళ్ళీ మన మాట, ఆ ప్రెసిడెంటు గాడికి కూడా గురే! మీరు ఎవరి తరఫు

# రేఖా చిత్రం

ఉంటే వాళ్ళదే గెలుపు." అంటూ, ఒక చిన్న కవరు సుందర్రామయ్య జేబులో పెట్టాడు. అదేమిటో చూసుకునేందుకు అతనికి వ్యవధిలేదు.

భోజనాలయ్యాయి. ఎవరి ఇళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు. సుందర్రామయ్య మునసబు గారి బగ్గీలో తన ఇంటి ముందు దిగాడు.

కోటూ, అవీ విప్పుకుని కాస్త మొహం అవీ కడుక్కుని కుర్చీలో కూర్చునేసరికి మునసబు ఇచ్చిన కవరు సంగతి గుర్తు వచ్చింది. లేచి వెళ్ళి తెచ్చాడు. విప్పి చూశాడు. వందరూపాయల నోటు!

తన సాక్ష్యానికి వందరూపాయల విలువ! తన కళ్ళని తానే నమ్మలేక పోయాడు.

"హమ్మయ్య! దీనితో ఆ కాబూలీ వెధవ అప్పు వదిలగొట్టెయ్యొచ్చు!" అనుకుని తృప్తి పడ్డాడు.

అనుకుంటూ కుర్చీలో నడుం వాల్చాడో లేదో సుశీల రాకెట్‌లా దూసుకు వచ్చింది.

"ఏం మావయ్యా! ఇంతే కదూ?" అంది, కళ్ళమీద దబికిల పడుతూ.

"ఇంతే అంటే?" అన్నాడు సుందర్రామయ్య, కళ్ళు ఇంత పెద్దవి చేసి.

"సరేలే! మామీద నీ కసలు దయలేదు!"

"అదేమిటి సుశీలా?"

"మరి లేకపోతే? భోజనానికి రమ్మని ఇలాగేనా చెయ్యటం."

"ఏ పాప్! అదా? భోజనానికేముంది లెమ్మా! నువ్వెక్కడికి పోతావ్, నేనెక్కడికి పోతాను? మనస్సులో అభిమానం ఉంటే చాలదా సుశీలా?"

"సరేలే! నువ్వెప్పుడూ ఇలాగే అంటూ ఉంటావు. రేపో మాపో అత్తయ్య వచ్చి ఏమనుకుంటుంది?" అంటూ అలవోకగా నవ్వింది.

సుందర్రామయ్య నవ్వుకున్నాడు. కుర్చీలోంచి లేచి తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాడు. అద్దంలో ముఖం చూసుకుంటూ ఉంటే—

"ఏం మావయ్యా! నీకు డబ్బు చాలా ఎక్కువైనట్టుందే! ఈ వంద రూపాయల నోటు ఇక్కడే పెట్టేశావు!" అంటూ ఆశ్చర్యంగా చూసింది.

సుందర్రామయ్య నవ్వుకున్నాడు. మాట్లాడకుండా ఆమె వైపుకి వచ్చి, ఆమె నడుం చుట్టూ చేతులు వేసి "సుశీలా!" అని ఆశగా చూశాడు.

ఆమె ఒక్క క్షణం స్తంభించి పోయింది. క్షణంలో మళ్ళీ తేరుకుని—

"మావయ్యా! చివరికి నువ్వూ ఇంతేనా?" అంటూ అతని చేతులు విడిపించుకుని విసవిసా నడిచి వెళ్ళిపోయింది.

సుందర్రామయ్య స్థాణువై పోయాడు. వంద రూపాయల నోటు బల్లమీద రెపరెపలాడుతూ ఉంది.

పండగలు అయిపోయాయి. సూరిగాడూ, పాపా, వాళ్ళమ్మా తిరిగి వచ్చేశారు. సుశీల వెనకటి చనువుగా రావటంలేదు.

సుందర్రామయ్య కుంచించుకు పోయాడు. జీవితంలో ఏదో పోగొట్టుకున్న వాడిలా దిగనారి పోయాడు. వాలుకుర్చీలో జేర్లబడి, కళ్ళు మూసుకుని ఉన్నాడు. అతను నిద్రపోతున్నట్టున్నా, అతని మనస్సు నిద్రపోవడం లేదు.

సూరిగాడు దగ్గరికి వచ్చాడు.

"నాన్నా! పాప మళ్ళీ వంకర టింకర్లుగా రాస్తోంది చూడు!" అని ఫిర్యాదు చేశాడు.

"కాదు నాన్నా!" అంటూ పాప దగ్గరికి వచ్చింది.

"గీతలు గీసుకునే రాస్తున్నా!" అన్నది పుస్తకం చూపిస్తూ.

సుందర్రామయ్య చూశాడు. గీతలన్నీ అడ్డదిడ్డంగా ఉన్నాయి.

"అవునమ్మా! గీతలు దాటకుండనే గీశావు. కాని అవి వంకర గీతలు. మనం గీసుకోవలసిన గీతలు వంకరగా ఉండకూడదు. చక్కగా ఉండాలి. అప్పుడే గీత తిన్నగా ఉంటుంది" అన్నాడు.

"మరి అన్నయ్య గీతలే గీసుకోడుగా!" అంది పాప.

"అవును. తిన్నగా గీత కుదిరిన వాళ్ళకి గీతలు అవసరంలేదు తల్లీ! అది కుదరని వాళ్ళకి, మనకే ఈ గీతలు కావాలి!" అన్నాడు, ఆగి, ఆగి.

పాప ఆశ్చర్యంగా చూస్తోంది.

సూరిగాడు విజయగర్వంతో నవ్వుకున్నాడు.

అప్పుడే వచ్చిన సుశీల, ఈ మాటలు వినగానే తలుపు చాటుకి తప్పుకుంది. ★



# అపస్వరం

మూలం: త్రివేణి

అనువాదం: శార్వాణి

### జరిగిన కథ

తల్లిదండ్రుల్ని కోల్పోయి అనాథైన మీరను పెదనాన్న క్రిష్ణయ్యగారు చేరదీస్తారు. ఆడపిల్ల భారాన్ని నెత్తినేసుకోడం వల్ల భవిష్యత్తులో చిక్కులెన్నో ఎదురవుతాయని ఆయన భార్య హెచ్చరిస్తుంది. క్రిష్ణయ్యగారామెను మందలిస్తారు. అక్కడ పెదనాన్నగారి పిల్లలతో ఆడుకుంటూ గతాన్ని కొంతవరకూ మరచి ఆనందంగా ఉంటుంది మీర.

## 2

పెద్దనాన్నగారి ఇంటికి వచ్చిన కొత్తలో మీర సంకోచ, దాక్షిణ్యాలతో, అందరితోనూ చనువుగా కలిసి మెలిసి తిరగలేకపోయింది. సూటిగా ఏమీ అనకపోయినా, పెద్దమ్మకు తనంటే ఇష్టం లేదన్న సంగతి మీర గ్రహించింది. కాని, పెదనాన్న ప్రేమవాత్సల్యాలు, నలుగురు అన్నయ్యల స్నేహం ఆమెనెంతో ఊరడించేవి.

చెల్లెలిని ఎంతో ప్రేమగా చూసేవారు. ఇంతవరకూ ఆడపిల్లలు ఇంట్లో లేకపోవడంవల్లో, మీర వలన వాలాలను వారెంతో కౌతుకంతో చూస్తుండేవారు. గోవిందు మీరకోసం గాలిపడగ కట్టిపెడితే, గోపాలం రాత్రి భోజనాలయ్యాక పిల్లలందర్నీ కూర్చోపెట్టుకొని, కమ్మని కథలు చెప్పేవాడు. శ్రీహరి మొదట మీరని పలుకరించడానికే సిగ్గుపడేవాడు కాని, క్రమేణా, మీరతో చనువుగా మెలగసాగాడు. తన స్నేహితుల ఇళ్లనుండి గులాబిపూలు తెచ్చి, చెల్లెలి కిచ్చేవాడు. శ్రీపాదు మీర సమవయస్కుడవటంతో, ఆటపాటలలో ఎప్పుడు కలిసే ఉండేవారు. పిల్లల నిష్కల్మషమైన స్నేహాన్ని చూసి, కృష్ణయ్యగారి మనస్సు ఆనందంతో నిండిపోయేది.

కాని, కమలమ్మగారి మనసు, అనాథ మీరని తమ పిల్లలతో సమానంగా చూడటానికి ఎప్పుడూ అంగీకరించేదే కాదు. ఒకే ఈడు గల మీరనూ, శ్రీపాదునూ, ఆమె చూసే తీరులో చాలా తేడా ఉండేది. మీర చిన్నపిల్లయినా, ఇలాటివాటిని సులభంగా గ్రహించేది. మీరను కొట్టి, తిట్టి చేసే ధైర్యం, ఆమెకు లేకపోయినా, సమయం దొరికినప్పుడు హేళనగా మాట్లాడి, ఆ పసి హృదయాన్ని గాయపరచేవారు. అలాంటప్పుడు మీర అమితంగా బాధపడినా, పెదనాన్న అన్నయ్యల ప్రేమవాత్సల్యాలతో అన్నీ మరచిపోవడానికి ప్రయత్నించేది. వీలైనంతవరకు, పెదనాన్న, అన్నయ్యల వద్దనే కాలం గడుపుతూ, పెద్దమ్మకు దూరంగా ఉండిపోయేది.

కమలమ్మగారు ఈ విషయం గమనించి ఉగ్రులైపోయేవారు. ఒకరోజు మీర గోపాలంతో సమానంగా బొంగరం ఆడుతూంది. భర్త ఇంటిలో లేని విషయం గమనించి మీరకు వివేకం చెప్ప బూను కొన్నారు కమలమ్మగారు.

"మీరా, నువ్వు ఆడపిల్లవి. ఎప్పుడూ ఇలా మగపిల్లలతో ఆడుతూండటం ఏం బాగాలేదు. రేపు అత్తవారింటికి వెళ్లాల్సిన పిల్లవు ఇంట్లో కాస్త పనిపాట్లు నేర్చుకొని, నాకూ సాయంగా ఉంటే ముందు ముందు నీకు మంచిపేరు. నాకూ మంచి పేరు . ." అని చెప్పుకుపోతున్నారు.

బొంగరానికి తాడుచుడుతోన్న మీరా, తెల్లబోయి గోపాలంవేపు చూసింది.

"ఇహ వూరుకోవమ్మా నువ్వు. ఆడపిల్లలు ఇంటిపనులు చేయటానికి పెద్దగా నేర్చుకోవాలా? వంటావార్పు ఇవన్నీ ఆడవాళ్లకి రక్తగతంగా వచ్చిన విద్యలే. మీర ఇంకా చిన్నపిల్ల. మెమ్మదిగా నేర్చుకుంటుంది. బాధ్యత మీదపడితే తనే నేర్చుకుంటుంది. ఇప్పుడో రెండు రోజులు పసిదానితో ఆడుకోనియ్."

గోపాలం ఈవిధంగా తమకే ఎదురు తిరుగుతాడన్న సంగతి నిరీక్షించని కమలమ్మగారి మొహం కోపంతో ఎర్రబడింది.

"చాల్లే, నోరుమూసుకో. పెద్దగా వేదాంతం చెప్పొచ్చావు. వచ్చేఏడు కాలేజీకి వెళ్లాల్సిన కుర్రాడివి ఆడపిల్లతో బొంగరం ఆడుతూ కూర్చో. ఇహ బాగుపడినట్లే. మీర నా శత్రువేం కాదు. దాని మంచికోసమేగా చెబుతున్నాను."

"వెళ్లుయి, అత్తారింటికి వెడితే, ఇలాగే ఉంటుందేమమ్మా! ఇక్కడున్నపుడన్నా ఆడుకుంటే తప్పా!"

"అంటే పనీ, పాట ఏమీ నేర్చుకోనక్కర్లేదంటావా ఛీ"

"ఎప్పుడో ఓ రోజు చెప్పావుగా 'అత్తారింటికి వచ్చేసరికి నాకేం పనులు వచ్చేవికావని' ఇప్పుడు నీకు రానిపనే లేదు."

"ఇక ఆపరా బాబూ నీకో దండం, నీతో వాదించడంకన్నా నోరుమూసుకుని పడిఉండటం నయం" అంటూ విసుర్రుగా లోపలికి వెళ్లిపోయారు, కమలమ్మగారు. అక్కడ గిన్నెలమీద తమ కోపాన్నంతా చూపసాగారు. ఆ చప్పుళ్లు విని గోపాలం చిరునవ్వు నవ్వాడు. ఇంతవరకు ఆలకిస్తూ దిక్కుమోహం వేసుకు నుంచున్న మీర, తాడు, బొంగరం గోపాలం చేతిలో పెట్టి,

"ఇహ చాల్లే అన్నయ్యా, ఆట" అంది.

గోపాలం చకితుడై "ఏం అప్పుడే విసుగెత్తిందా?" అన్నాడు.

"పెద్దనాన్నయ్యా, పెద్దమ్మా కోపం తెచ్చుకుంది. నేనిక ఆడను" అంటూ కళ్లల్లోని నీరు జారి క్రింద పడకముందే అక్కడినుండి పారిపోయింది మీర. అది గమనించి గోపాలం మీర వెనుకనే తనూ వెళ్లాడు. మీర మౌనంగా ఏడుస్తూ కళ్లు తుడుచుకొంటూంది.

"మీరా ఏడుస్తున్నావా!"

మీర బదులు పలకలేదు.

"ఛా ఈమాత్రానికే ఏడుస్తారా ఎవరైనా? నన్నూ అమ్మ తిట్టలేదా? నే ఏడుస్తున్నానా మరి!"

మీరకు ఆ క్షణంలో అందరు పిల్లల్లాగ తను ఉన్నట్లనిపించింది.

"ఏడవకు మీరా, శ్రీపాదు వస్తున్నాడు"

అంతలోనే ఉత్సాహంతో గెంతుతూ, శ్రీపాదు అక్కడికి వచ్చాడు.

"మీరా, ఎన్ని జాంకాయలు తెచ్చానో చూశావా?" అని తన జేబుల్లో నింపుకున్న దోరకాయల్ని మీర ముందు పోశాడు. మీర ఒక కాయ తీసుకొని కొరికి,

"అన్నయ్యా, నువ్వు కూడా తిను. ఎంత తియ్యగా ఉందో!" అంది. కాసేపట్లోనే ఇంతకు ముందు జరిగిందంతా మరచి కుర్రాళ్ళతో ఆడుకుంది.

కాన్వెంటులో చేరిన కొద్ది రోజులలోనే మీర టీచరు మెప్పుదలకు పాత్రురాలయింది. తోటి పిల్లలు కూడ మీర అంటే ఎంతో ఇష్టపడేవారు. మీరతో స్నేహంకోసం పోటీపడుతుండేవారు. సదా నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూ, స్నేహార్ద్ర హృదయంతో అందర్నీ ఆకట్టుకునేది మీర.

అందులో ఎక్కువ స్నేహంగా, ఎప్పుడూ ఒకే జట్టుగా ఉంటున్నది ముగ్గురు: రాజేశ్వరీ, నర్మదా, చంపా. మీర బొద్దుగా పొట్టిగానున్న రాజేశ్వరిని 'ఏనుగుపిల్ల' అని ముద్దుగా పిలిచేవారు. నర్మద, డాక్టరుగా రమ్మంటూ ప్రవహించే నీటికన్న చంచలమైన మనసు. విశాలమైన కనురెప్పలుగల నర్మద అందమంతా నోరు మూసుకొన్నప్పుడే! వక్రమైన ఆమె పలువరస, తీర్చిదిద్దినట్టున్న మొహంయొక్క అందాన్నంతా పాడు చేసేది. చంప నిలకడలేని పిల్ల. చిన్న చిన్న మాటలకంతా కోపం తెచ్చుకొని, జట్టు వదలేసేది. 'ఎన్నిమ్'గా ఉండి మళ్ళీ కాసేపటికే జట్టు కడుతూండేది.

నలుగురు స్నేహితురాళ్ళు నెలసరి 'టెస్టు'ల్లో మొదటి మార్కులకోసం పోటీపడేవారు. కాన్వెంటులో అప్పుడప్పుడూ వేసే నాటకాల్లో మీరదే ప్రధాన పాత్ర.

'అందాలు చిందే మొహం, సన్నదైనా, ఎంత దూరానికైనా స్పష్టంగా వినబడే కంఠం, భావోద్వేగాల ననుసరించి వెను వెంటనే మొహంలో భావాలను మార్చే చాతుర్యం ఇవన్నీ చూసి, నాటకం వేయించే టీచరు ముగ్ధురాలయ్యేది. 'చిన్నారి పటి' అని మీరను ముద్దుగా పిలుస్తుండేది.

గోపాల్ ఎస్ ఎస్ ఎల్ సి లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయినప్పుడు, అందరికన్నా ఎక్కువ ఆనందించింది మీరా. రిజల్టు తెలిసిన వెంటనే "పెద్దమ్మా" అని పరిగెత్తుకుంటూ లోపలికి వచ్చింది.

కమలమ్మగారు కంగారుగా "ఏమిటి ఏమయింది" అన్నారు.

"మరేం అన్నయ్య ఫస్టు క్లాసులో పాస్ అయ్యాడు" అంది మీర

కమలమ్మగారు సంతోషంతో "ఉండు, పంచదార, కొబ్బరికోరు కలిపి తెస్తాను" అంటూ లోపలికి వెళ్ళారు

కృష్ణయ్యగారు కొడుకు రిజల్ట్సు తెలుసుకొని, ఎంతో సంతోషించారు కమలమ్మగారు ఇచ్చిన తీపి కొద్ది కొద్దిగా నోట్లో వేసుకొంటూ,

"తరువాత ఏం చేస్తావురా అబ్బాయ్" అన్నారు.

"ఇంటర్‌లో చేరుతాను నాన్న"

"ఆప్షన్స్ ఏం తీసుకుంటావ్?"

"పి బి జడ్ తీసుకుందామని ఉంది తరువాత యం బి లో చేరడానికి వీలుంటుంది"

"నువ్వలా ఆశించటం సహజమే నాకూ చదివించాలనే ఉంది కాని యంబి లో సీటు దొరకటం దుర్లభం దొరకినా చదివించే స్తోమత నాకు లేదు"

గోపాలం ఆవేశంతో "బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకొంటే సీటు ఎందుకు దొరకదు సీటు దొరికితే ఎలాగోలాగ చదవవచ్చు" అన్నాడు.

గోపాలానికి డాక్టరవాలన్న కాంక్ష తీవ్రంగా ఉండటాన్ని గమనించి కృష్ణయ్యగారు మరేమీ మాట్లాడలేకపోయారు

మీర అన్నయ్య వెనుకనే అతని గదిలోకి వెళ్ళింది

"యం బి అంటే ఏమిటన్నయ్యా?"

"అది చదివితే డాక్టరవుతావన్నమాట"

"అంటే నీకు డాక్టరవాలని ఉందా?"

"అవును, నీకు లేదా?"

మీర కళ్ళముందు నర్మద తండ్రి డాక్టర్ సుబ్బారావుగారి రూపం మెదిలింది ఆయన గవర్నమెంటు డాక్టర్ ఆ శ్రీసదర్పమూ, మీర మనస్సును ఆకర్షించాయి లక్ష్మి, సరస్వతుల కటాక్షమువల్ల కారు, పెద్ద బంగళా, రేడియో నౌకర్లు, అన్ని సౌకర్యాలతో వైభవంగా అనుభవిస్తున్నారు ప్రజలు ఆయనకు చూపే గౌరవం మీరను ముగ్ధురాలిని చేసేది ఇవన్నీ తలచుకొని మీర

"అవునన్నయ్యా, నాకూ డాక్టరవాలనే ఉంది అలా అయితే ఎప్పుడూ నర్మద నాన్నగారిలా కారులోనే తిరగవచ్చు" అంది.

"ఏ నర్మదా? డాక్టరుగారమ్మాయా? దంత వక్రం కదూ?"

"నర్మదలా ఉంటే నీకేమి [illegible]? నువ్వేమన్నా పెళ్ళి చేసుకోవాలా ఏం?" అని తన స్నేహితురాలిని వెనుకేసుకొచ్చింది మీర

"బాబోయ్ ఆ అమ్మాయినే? పెళ్ళి చేసుకోవటమే! పళ్ళు చూసే పారిపోవాలి ."

"చాల్లే ఊరుకో అన్నయ్యా పళ్ళు బాగలేకపోతేనేం మొహం అందంగా లేదూ!"

"ఉంది నిజమే కాని ఎక్కువగా నవ్వద్దని చెప్పు."

మీర నవ్వింది ఎర్రటి పెదిమెల వెనుక ఆమె పన్నటి పలువరస తళుక్కుమంది

రెండేళ్ళు తొందర తొందరగా గడచిపోయాయి. గోపాలం మొదటినుండి తన కోర్కెను నెరవేర్చు



కోటూ టానికోసం శ్రద్ధగా చదివాడు. అనుకున్నట్టు గానే ఇంటర్లో ఫస్టుక్లాసు వచ్చింది ఆ విషయం తెలిసిన రోజున మీరకు తన అన్నయ్యంత తెలివిగలవాళ్ళు ఈ ప్రపంచంలోనే లేరనిపించింది

రిజల్ట్సు వచ్చిన రోజు మధ్యాహ్నం అందరు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు శ్రీపాదు, గోపాలాన్ని "పార్టీ తప్పక ఇవ్వాలన్నయ్యా" అని గడబిడ చేస్తున్నాడు. మీర చిరునవ్వుతో,

"పెదనాన్నా, ఇంతవరకూ మీకో విషయం చెప్పకుండా దాచాను" అంది

"అమ్మ దొంగా నా కన్నా చెప్పకుండా దాచేది ఏమిటమ్మా అది"

"మా కాన్వెంటులో ఈరోజు పేరెంట్సుడే"

"అలాగా, చెప్పవేం మరి"

"టీచర్లూ, మొదటే ఇంట్లో చెప్పొద్దండి సీక్రెంగా ఒకేసారి, వేడి వేడి కబురుచెప్పి ఆశ్చర్యపరుద్దాం!" అన్నారు అందుకని"

ఇదంతా వింటున్న కమలమ్మగారు "నువ్వేం వేషం వేయడంలేదుగదా, కొంపదీసి" అన్నారు మీర చిన్న మొహంతో గోపాలంవేపు చూసింది గోపాలం,

"వేషంవేస్తే తప్పేమిటమ్మా? మీర ఇంకా చిన్నపిల్ల" అన్నాడు

"చిన్నపిల్లేమిటి తొమ్మిదేళ్లు దాటితేనూ"

"తొమ్మిదేళ్ళకే మహా వయసయిపోయిందా ఏంటి"

అంతలో కృష్ణయ్యగారు కల్పించుని

"నువ్వూరుకో కమలా మీర ఇంకా పసిపిల్ల ఊరుకోరా అబ్బాయ్ సాయంత్రం మీర అభినయం చూస్తే అదికే తెలుస్తుంది"

శ్రీహరి అడిగాడు "ఏం నాటకం వేస్తున్నారు"

"సిండ్రెల్లా నాటకం"

శ్రీపాదు కుతూహలంతో "నువ్వేం వేషం వేస్తున్నావు" అన్నాడు

# అపస్వరం

"సిండ్రెల్లా"

"అయితే తప్పకుండా చూడాల్సిందే" గోపాలం అన్నాడు

"నాటకం ఇంగ్లీషా, కన్నడమా?"

"ఇంగ్లీషు నాటకం'

"మరి మీరు మాట్లాడే మాటలకంతా మీకు బాగా అర్థం తెలుసా?"

"నే అన్నీ తెలుసు మా కన్నడం మాస్టారు అంతా బోధపరిచారు" అంటూ మీర లోపలికి వెళ్ళి తన పుస్తకంలో దాచుకొన్న ఆహ్వాన పత్రిక తెచ్చి కృష్ణయ్యగారి కిచ్చింది

సాయంత్రం ఐదు గంటలకల్లా ఆహ్వానితులతో నిండిపోయింది కాన్వెంటు హాల్ లేత ఆకుపచ్చ లంగా, తెల్లటి సిల్కు జాకెట్ వేసుకొన్న అమ్మాయి గేటు దగ్గిర నుంచుని ఎవరికోసమో ఎదురు చూస్తోంది నర్మద లోపలినుండి పరిగెత్తుకుంటూవచ్చి, "మీరా టీచర్ పిలుస్తున్నారు డ్రస్ చేసుకుందువుగాని రా" అంది

"కాస్త ఉండవే పెదనాన్న, అన్నయ్య అందరు అందరింటికే వస్తామన్నారు ఇంకా రాలేదేమిటా అని చూస్తున్నా" అంది దూరంలో వస్తూన్న శ్రీపాదు కనిపించగానే "అమ్మయ్యా" అనుకొంటూ లోపలికి వెళ్ళిపోయింది

ఆరోజు చర్చి బిషప్ ఒకాయన అధ్యక్షత వహించారు ఐదున్నర గంటలకు కార్యక్రమం ప్రారంభమయింది ప్రార్థనానంతరం ఆటల పోటిలలో గెలిచిన వారికి బహుమతులు పంచిపెట్టారు తన కొచ్చిన నాలుగు బహుమతులనూ మీర అందుకున్నప్పుడు అందరికన్నా ముందు, చప్పట్లు కొట్టడం ప్రారంభించి, ఆఖరులో నిలిపింది శ్రీపాదు లంబాడీ నృత్యం, జపాన్ నృత్యాలయ్యాక సిండ్రెల్లా నాటకం మొదలయింది మీర తన శక్తికిమీరిన అభినయం ప్రదర్శించింది తరచుమైన మోహాన్ని మరలు గొలిపే అభినయం హావభావాలు అందరి మనసులనూ దూరగొన్నాయి దేవత ప్రత్యక్షమై తన దండంతో సిండ్రెల్లాను స్పృశించినప్పుడు క్షణమాత్రంలో చింపిరి దుస్తులు తీసివేసి సర్వాలంకార భూషితురాలై నిలచిన సిండ్రెల్లా వాక్చక్యాన్ని అందరూ మెచ్చుకున్నారు రాజకుమారునితో చేసిన నృత్యం, హాలివుడ్ నృత్యానికన్నా మనోహరంగా ఉందని పొగిడాడు గోపాలం

నాటకం అయిపోయింది అధ్యక్షులు నాటకం వేయించిన టీచర్లనీ, పాత్రలకు జీవంపోసి నటించిన బాలికలనూ మనఃపూర్వకంగా అభినందించారు. మీరను ప్రత్యేకంగా అభినందించారు

కృష్ణయ్యగారు దారి పొడుగుతా మీర అభినయాన్ని మెచ్చుకుంటూనే ఉన్నారు కమలమ్మగారు వినలేక విసిగి,

"ఇహ చాలు వూరుకుందురూ నేర్పితే ఎవరైనా చేయగలరు అదేం బ్రహ్మ విద్యా ఏమిటి? ఇప్పటినుండి ఇలా నాటకాల్లో వేయిస్తూ కూర్చోండి రేపు చేసుకున్నవారు సుఖపడుతాడు" అన్నారు వెంటనే గోపాలం,

"అమ్మా నువ్వెప్పుడూ ఇంతే చిన్నపిల్ల నలా నిరుత్సాహపరుచవచ్చా? ఆ వయసు పిల్లలు అలా చలాకీగా ఉంటేనే ముచ్చటగా ఉంటుంది" అన్నాడు.

మీర కృతజ్ఞతతో గోపాలంవేపు చూసింది

గోపాలం తన కోర్కె ప్రకారం మెడికల్ కాలేజికి అప్లికేషన్ను పెట్టుకున్నాడు ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది తరువాత సీటు దొరికింది కృష్ణయ్యగారు కొడుకు ఉత్సాహం చూసి, ఎలాగైనా చదివించాలని నిశ్చయించుకున్నారు అందరికన్నా ఎక్కువ ఆనందం మీరది తన గొప్పగా చెప్పుకుంది గోపాలం కాలేజి లైబ్రరీ నుండి తెచ్చే పెద్ద పెద్ద పుస్తకాలను చూసి ఆశ్చర్యపోయింది మీర

ఒక ఆదివారం మధ్యాహ్నం కమలమ్మగారు "మీరా, గోపాలాన్ని పిలు, టిఫిన్ తీసుకుంటాడు" అన్నారు

మెల్లిగ గదిలో ప్రవేశించింది మీర. మేడమీద స్కెలిటన్‌లాగా ఉన్నమనిషి బొమ్మ మీరని ఆకర్షించింది ఇంతవరకు ఎప్పుడూ అలాంటి బొమ్మలు చూడలేదు మీర నరాలు, ఎముకలు ఎత్తి కనిపిస్తున్నాయి ఆ బొమ్మలో గోపాలం మంచంమీద పడుకొని నిద్రపోతున్నాడు.

"అన్నయ్యా!"

గోపాలం మేలుకొని, "ఏమిటమ్మా?" అన్నాడు.

"పెద్దమ్మ పిలుస్తోంది"

గోపాలం లేచి కూర్చొని, వళ్ళు విరచుకొన్నాడు టేబిల్‌మీదున్న తెల్లటి మట్టితో చేసినట్టున్న వస్తువుమీద మీర దృష్టి నిలిచింది

"ఇదేమిటన్నయ్యా?"

"మనిషి తలకాయ"

"అంటే? "

"అంటేనా " అంటూ గోపాలం మంచం దిగి వచ్చాడు మీర పొట్టి జడ లాగి, తలని అటూ ఇటూ తిప్పి "ఇదే తలకాయంటే" అన్నాడు.



మీర గాబరాగా, "ఇది నా తలకాయా?" అంది

"నీ తలకాయకాదే, మొద్దూ ఎవరిదో పుర్రె ఇపుడు చూడవమ్మాయ్ మనతలపై భాగంలో జుత్తు, చర్మం, కళ్ళు, ముక్కు అన్నీ ఉన్నాయి ఇదంతా మా వంటిపై పొర ఇందులో రక్తం మాంసం ఉన్నాయి వేలుకోసుకుంటే రక్తం వస్తుందా లేదా?"

"వస్తుంది"

"దీనిలోపల ఎముక లున్నాయి ఇపుడు నీ చెయ్యి గిల్లిచూడు ఇది చాలా మృదువు అని పించేదే మాంసం ఇంకాస్త గట్టిగా ఒదిమితే గట్టిగా తగులుతుందే అవే ఎముకలు అలాగే ఇది మన తల పుర్రె"

"అలాగా!" మీర కుతూహలంతో వినసాగింది

గోపాలం మీరను అద్దంముందు నుంచోపెట్టి మీర తలతో పోలుస్తూ,

"చూడు మీరా! ఇక్కడ రెండు కంతలున్నాయే అవే కళ్ళుండే స్థానం ఇక్కడ ముక్కు, ఇక్కడ పెదవులు, ఇక్కడ పళ్ళు, ఇవి చెంపలూ" అంటూ వేలితో ప్రతిఒక్కటి చూపుతూ వివరించాడు

మీర ఆశ్చర్యంతో అడిగింది

"నిజంగా మన మింత అసహ్యంగా ఉంటామా?"

"అవునమ్మా నువ్వు డాక్టర్ చదువు మనిషి దేహం ఎంత చిత్రంగా ఉంటుందో నీకే తెలుస్తుంది డాక్టరైతే ప్రజల జబ్బులు నయం చేయచ్చు చేతినిండా డబ్బు వస్తుంది నీకు డాక్టరవాలని లేదా?"

"ఉందన్నయ్యా నేను తప్పకుండా డాక్టరవుతాను"

మొదట కేవలమూ గొప్పగ బ్రతకటాని డాక్టరవాలనుకొంటున్న మీర, ఇప్పుడు శరీరశ చిత్రాలను తెలుసుకోగోరి డాక్టరవాలని ఆశించింది ఆమె కళ్ళలో, ఆశ కలగా నిలిచింది

"అన్నయ్యా, అమ్మ పిలుస్తోంది" అన్న గోవిందు పిలుపుతో, గోపాలం బయటికి వెళ్ళిపోయాడు మీర టేబిల్‌మీదున్న పుర్రెను చేతుల్లోకి తీసుకొని, మృదువుగా నిమిరింది నిమురుతూ, అప్పుడే తాను డాక్టరైనట్టూ, అందరి రోగాలు నయం చేస్తున్నట్టూ, చేతినిండా డబ్బు సంపాదించినట్టూ కలలు కనసాగింది

"డాక్టరయితే ఎంత బాగుంటుంది" అని మెల్లగా తనకు తానే చెప్పుకుంది ఆ పసి మనసులో గోపాలం చిత్రించిన చిత్రం బలంగా నాటుకుంది

మీర పెరుగుతున్నకొలది, ఆ ఆశ కూడ పెరగసాగింది గోపాలం చెస్తున్న పుస్తకాలను తీసుకొని, తన కర్థంకాని బొమ్మలను తదేకంగా చూస్తూ కూర్చొనేది గోపాలానికి తీరికగా ఉన్నప్పుడు, "ఈ బొమ్మ ఏమిటన్నయ్యా?" అని అడిగేది బాల్య సహజమైన మీర కుతూహలాన్ని గమనించి, గోపాలం చిరునవ్వు నవ్వి, మీరకు అర్థమయ్యేలా వివరించి చెప్పేవాడు డాక్టరవాలన్న ప్రబలమయిన కాంక్ష ఆ చిన్ని హృదయంలో ఈవిధంగా వేరులు నాటుకుంది

గోపాలం ప్రతి సంవత్సరం మంచి మార్కు

38 వ పేజీ చూడండి

# మహానగరంలో కారడవి 2


నాటింగ్ హిల్‌లో యీ పాతకొంపలో ఓ మారుమూల గదిలో వున్నాను

**పాట్ బోల్టన్ చెప్తున్న కథలో రెండో భాగం. ఆకలి ఎంత చెడ్డదో యీ భాగంలో చదవండి...**

## అన్నీ ఎండమావులే!

లండన్‌కి పారిపోయి ఏదో బావుకుందామని ఇల్లు వదిలి సాహసంగా పారిపోయే అమ్మాయిలను— ఒక డజను పైచిలుకుమందినేనా— నేను నా నాలుగు వారాల 'లండన్' జీవితంలోను చూశాను నాకు తారసపడ్డ యీ అమ్మాయిల కథలు విని, కొంతలో కొంత పిల్లలతో పరిచయంవల్ల పిల్లల సంగతి తెలుసు కాని—నేను గ్రహించినది యిది వస్తున్నప్పుడు తియ్యని కలలుకంటూ వస్తారు అవి ఎండమావులుగా మారిపోతాయి అవి

కెన్సింగ్‌టన్‌లో హాయిగా, ఒంటరిగా, కలాపిగా గడిచే చిన్న యిల్లూ—, మంచి ఉద్యోగం గట్రా ఆలోచించుకుని వస్తారు కాని, చివరికి నాటింగ్‌హిల్ మురికివాడలో గాలి, వెల్తురు చొరని ఇరుకు గదిలో దరిద్రంలో మిగులుతారు

వెస్టెండ్ స్టోర్‌లో హాయిగా ఉద్యోగం చేసుకుందామనుకున్నవాళ్లు అదృష్టం పలికితే తప్ప— ఏదో ఒక ఫ్యాక్టరీలో కూలీగా స్థిరపడిపోతారు ఆమాత్రం చాలీచాలని భత్యాలు వాళ్ల యింత దూరం రాకుండానే సాధించుకోగలరు, అన్న విషయం తెల్సుకునేసరికి అంతా ఆలశ్యం అయిపోతుంది అందాక పల్లెల్లోను, ఇళ్లల్లోను ఉండి నగరవాసాన ఉద్యోగాల గురించి తియ్యని కలలు గనే అమ్మాయిలకు నాదొక హెచ్చరిక

దయచేసి శ్రద్ధగా యీ దిగువ నేచెప్పే అమ్మాయిల విషాదగాథలను సానుభూతితో చదవండి మీకు అవసరం

## బార్బరా కథ

బార్బరా లండన్‌కి తియ్యని కలలతో జీవనోపాధి వెతుక్కుంటూ వచ్చింది ఆ కొత్త గెస్ట్ ఇండియన్ యింట్లో చిన్న గది అద్దెకి దొరికింది. ఆ గదికి ఉన్న మొదటి,చివరి మంచి లక్షణ మొక్కటే అద్దె చాలా తక్కువ.

దురదృష్టవశాత్తు బార్బరా జబ్బు పడది. ఇంటిగలాయన చాలా మంచివాడు అద్దె వూసు ఎత్తకుండా ఆమెకు సపర్య కూడా చేశాడు బార్బర మంచిపిల్ల ఇతనిమంచితనం ఎట్ల గౌరవంపెరిగి ఆగది వదిలి అతనితోపాటు ఉండేటందుకు అతని ఇంట్లోకి బస మార్చింది కూడా కాని, కొంచెం రోజుల్లోనే ఇంటిగలాయన తీవ్రమైన తత్వం ఆమెకు అనుభవంలోకి వచ్చింది కాస్త తప్పుకి గూడా అతగాడు ఆమెను చేయి చేసుకుని మందలించసాగాడు.

ఓసారి ఆ పెద్దమనిషి ఉదయం 4 గంటలకి కొంప చేరాడు అప్పుడు తిండి ఉడకబెట్టమన్నాడు నావల్ల కాదంది బార్బరా అతను మండిపడి ఆపిల్ల నమాంతం వంటింట్లోకి ఈడ్చుకువెళ్లి కుదేశాడు అంతేనా? రానురాను ఆమె కతని వ్యవహారం అర్థమైపోయింది.

స్నేహితులను, మిత్రులను పిలిచేవాడు ఈమెను వాళ్లతో సరసమాడ మనేవాడు కాదంటే చెయ్యి చేసుకునేవాడు ఇంత దుర్మార్గుణ్ని వదిలి బార్బరా ఎందుకు పారిపోలే దంటారా? ఆమాత్రం 'రక్షణ' కూడా ఇతరత్రా మహానగరం నీడన ఉండదు కనుక—దుర్మార్గుడే అయినా రక్షణ, పోషణ యిస్తున్నాడ గా యజమాని

## డోరీన్ అనే బాలిక కథ

పద్దెనిమిది లోపే ఆ పిల్ల వయస్సు సిగ్గు కొంతర్ల మధ్య చలాకీగా ఉండే యీ అమ్మాయికి కాఫీబార్' అలవాటు అయింది. ఆమె ఓ స్పిన్ యువకుని ఆహ్వానాన్ని అమాయకంగా అందుకుంటనే చెప్పాలి.

దగ్గరగా ఉన్న పానశాలలో "వో గుక్కెడే" కదా తాగుతాము అనుకున్నట్లు విపరీతంగా తాగేయవలసి వచ్చింది. మా రూమ్‌కి పోయి కొన్ని వేడి కాఫీ త్రాగుదువు రమ్మంటే" మత్తుగా వప్పుకోక తప్పలేదు డోరీన్‌కి ఆ కుర్రాడి యిల్లు చేరేసరికి యించుమించు డోరీన్‌కి ఒంటిమీద స్పృహలేదు.

మర్నాడు ఉదయం తెలివి వచ్చేసరికి డోరీన్ వంటిమీద గుడ్డలేవు కంబళి ఒకటి పైన కప్పివుంది అంతే ఆ 'స్పిన్ వీరుడు' మరి అయిపు లేడు కాని, అతని 'చిహ్నం' గా తొమ్మిది మాసాలు మోసి ఒక బిడ్డను కన్నది డోరీన్—చూడండి ఎంత విషాదగాథో యిది కేవలం నా పరిశీలనలోని విషాద కథలలో యివి కొన్ని మాత్రమే.

## సరే మళ్ళీ నా కథ

ఫ్యాక్టరీలో వారం బట్వాడామీద బ్రతుకుతున్నప్పుడే నాకు ఆకలి మజా బాగా తెలిసి వచ్చింది. కప్పు పులుసు, వో కప్పు కాఫీతో మధ్యాహ్నం రొట్టె కాస్త తేనె, లేదా కాసిన్ని బిస్కట్లతో రాత్రిపూటా గడుపుకోవాల్సి వచ్చింది

హామ్మర్‌స్మిత్‌లో నెయున్న ఫుడ్ ఫ్యాక్టరీలో నాతో కలిసి పనిచేసే 'ఎల్సీ'తో యీ విషయం మాట్లాడాను

ఎల్సీ అదోలా నవ్వేసింది.

"ఎవడేనా దద్దమ్మ దొరికేదాకా అదే నీ పంచభక్ష్య పరమాన్నాలూ" ను అన్నది

ఆకలిబాధలకు వోర్వలేకనే యిలా పారిపోయిన అమ్మాయిలు మగాళ్ల వేటలో పడతారు మంచి భోజనం పెట్టిస్తే చాలు, వాళ్లకి ఎల్సీ డెర్బీషైర్ లోని మాట్‌లాక్ నించి పారిపోయి వచ్చేసింది. తేలికగా యీ కిటుకు నాకు చెప్పేసింది

పైగా ఎల్సీ ఏ జాగాలో మాకు బలుద్దాయి అబ్బాయిలు తగిలే అవకాశముందో కూడా చెప్పేసింది శనివారం అక్కడికి పోవి మన్నది

సరే నేను వెళ్లానని వేరే చెప్పక్కర్లేదు.

ఎల్సీ హెచ్చరిక చేసింది నన్ను "ఎవడితో నేనా ఒక్కసారే "డన్స్" లో పాల్గొను— అంటే వాడు మంచి భోజనప్రియుడు కాని పక్షంలో " అని.

కాని కర్మ! నేను యింగ్లీషువాళ్లతో మూమ్మారు డ్యాన్స్ చేసి నా వాళ్లల్లో ఒక్కడూ నా ఆకలి మొర ఆలించే దీనదయాళువుగా గోచరించలేదు

అంతలో ఒక వర్ణేతరుడు (నల్లవాడు నైజీరియన్) తారికాడు బాగా జేబు పుష్టిగలవాడల్లే ఉన్నాడు సగంసేపు డాన్స్ చేస్తూనే నేను దాహంగా ఉందన్నాను "బార్" లో వెంటనే కావల్సిన పానీయం త్రాగాం యిద్దరం

నాకు ధైర్యం వచ్చింది "మీరు యిక్కడ భోజనంలాంటిది కూడా చేస్తారేం ?" అన్నాను అమాయకంగా

"తప్పకండా" అన్నాడు అతను.

"ఏం కావాలి నీకు ?" అడిగాడు సానుభూతితో

నేను తనివితీరా వో ప్లేటునిండా శాండ్‌విచ్‌లు కేకులు అవీ యివీ అన్నీ తీసుకున్నాను

అతను నైజీరియా దేశస్థుడు పేరు "ఇబ్రూ ఆబు" వయస్సు పాతిక ప్రాంతంలో ముఖ్యమైన సంగతి వాళ్ల నాన్నగారు నైజీరియా తెగల్లో ఒక తెగ నాయకుడు ఏడుగురు భార్యలు, చలా సంతానము గలవాడు! అన్నాడు

"నేను మాత్రం ఒక్కర్తినే వివాహమాడతాను. ఒకవేళ ఆ సుందరాంగి కూడా ఏనిబోటి ఇంగ్లీషు పడుచుపిల్లో అయినా అభ్యంతరం లేదు'' అంటూ నావేపు క్రీగంట చూశాడు.

అయితే యింతమాత్రానికే నేను పద మీ ఇంటికి అనలేదు తప్పించుకున్నాను కూడా. మర్నాడు కలుసుకుందా మన్నాను. చక్కని మైనపు బొమ్మల ప్రదర్శనశాలకి లాక్కుపోయాడు నన్ను మర్నాడు "కివ్యూ'' కాని నేను ఆకలితో నకనక లాడుతున్నాను అవాళే చెప్పేశాను.

పైగా ఆ ప్రాంతాల్లో కళ్లు ఖరీదు ఎక్కువ వసూలుచేసే పెద్ద దుకాణంలోకి తీసుకుపోయాను. కడుపునిండా కావల్సినన్ని తినేశాను పాపం! "ఆబు'' ముక్కు పిండేశారు వాళ్లు.

నేను ఎల్సీ మాటలు జ్ఞాపకం చేసుకున్నాను— నిజమే ఎల్సీ అన్నట్టు "మగాళ్ళే భోజనం టిక్కెట్‌గా వాడుకోవచ్చును. తిరిగి మా యింటిదాకా 'కివ్యూ' నన్ను దిగబెట్టాడు. "ఇంట్లోకి రాండి'' అని నేను అనలేదని ఆబూ మండిపడ్డాడు కూడా. కాని నేను మెల్లిగా అతని పట్టునించి తప్పుకు చల్లగా తలుపు వేసుకున్నాను.

ఏం తిట్టుకున్నాడో పాపం! వెళ్లిపోయాడు.

నా డైరీలో యిలా రాసుకున్నానా రాత్రి

"ఆకలిబాధ చాలా అవసరమైంది. దాన్నించి తప్పించుకుందికి ఇష్టంలేనివాడికి కూడా యిట్టే ఆడపిల్ల లొంగిపోతుంది!''

రెండు వారాల పరిశీలనానంతరం 'ఎల్సీ' ని ఈ వాతావరణాన్ని నేను వదిలేశాను. ఇంకా కొత్త విషయాలు తెల్సుకోవాలి కదా!

వై డబ్ల్యు సి ఏ (యంగ్ విమెన్ క్రిస్టియన్ అసోసియేషన్) హాస్టల్లో చేర్దామని ఇక్కడ ఈ హాస్టల్‌లో యితర హోస్టల్లకన్నా రూములు చవుకగా దొరుకుతాయి అనుకున్నాను. కాని, ఇది మరీ దారుణంగా ఉంది. మరి ముగ్గురితో కలిసి ఉండాలి. ఒక రాత్రి పడక ఒక ఉదయపు ఫలహారం కలిపి పది షిల్లింగులు. నా డైరీలో రాసుకున్న మాటలు చదవండి:

"శుభ్రంగానే ఉంది. మరీ చలిగా ఉంది. ఎంతకీ నిద్ర పట్టలేదు నాకు. చల్లని ప్రక్క! వేణ్ణీళ్ల బాటిల్'' ఐదు షిల్లింగులు! అది కొనడం నా తరం కాదు. ఎవరి విషాద ప్రపంచంలో వాళ్లు ఉన్నారు. ఒకరి బాధ ఇంకొకరు వినలేదు. అబ్బ! ఎంత ఒంటరితనం మిది!'

మొత్తానికి ఈ హాస్టల్ నాకు అందని మానివండు. ఇంత నేను భరించలేను. కొంచెం రోజుల్లోనే ఏన్ ప్రయివేటు హాస్టల్ మారిపోయాను— ఇది చౌక. అందులో 20 మంది అమ్మాయిల దాకా ఉన్నారు.

ముగ్గురేసి, నలుగురేసి మంది ఓ గది. ఒక స్నానాల గది రెండు వాష్‌బేసిన్లు ఉన్నాయి. నేను ఆ హాస్టల్లో చేరిన రోజున చాలా కొంచెం తిన్నాను. తిండి దొరికినా వెల ఎవ రివ్వగలరు?

చలి ప్రతాపం నాకు బాగా అవగాహన అయింది. పేరిపోయే అమ్మాయి లందరిలాగే, నేను కోటువాళ్లు, కంబళ్లు కూడా తెచ్చుకోలేదు.

రెండు రోజుల తర్వాత డైరీలో యిలా రాసుకున్నాను. "మళ్లీ భోజనం అరోటి పులుసు, టీ నీళ్లు అయింది. కాని, ఆరు పెన్నీల "చిప్స్" తిన గలిగాను. నా కవి మహా యిదిగా ఉన్నాయి.''

కాని ఐదురోజుల్లోనే ప్రయివేటు హాస్టల్ ఖరీదు కూడా నా అంతస్తుకు ఎక్కువైపోయింది. మారిపోతా నన్నాను. "కాని, నెలరోజులు నోటీసు యిచ్చి కదలమన్నాడు'' యజమాని. వారాల పద్ధతిని వుండే నేను వారం నోటీసు యిస్తే చాలునని బాగా వాదించాను.

మొత్తానికి ఇంకా ఉన్నా ఒద్దు మాత్రం ఇవ్వడం జరగదని బయటపడ్డాను పాపం! ఆ హాస్టల్లో అమ్మాయిలు అసలు ఒద్దికన్నా ఎక్కువే యిస్తారుట యజమానికి!

నేను తర్వాత నాటింగ్‌హిల్‌లో ఒక చిన్న గది సంపాదించాను.

అప్పుడే రెండువారాలయింది నేను లండన్ వచ్చి. ఫ్యాక్టరీలో నా నేస్తం జోన్ అనే అమ్మాయి ఉంది. ఆపిల్ల యిద్దరు ఇటాలియన్ యువకులను పట్టుకోగలిగింది. "పోదాం—మాంచి భోజనం కన్నా ఇంకేమీ వద్దు మనకి'' అన్నది. వెళ్దామనుకున్నది.

జోన్ ఉత్తరాది పిల్ల. రకరకాల పార్టీలకు తాను ఎలా వెళ్లిందీ చెప్పింది.

ఒంటరిగా ఏ కుర్రాడితో నేను వెళ్లడంకన్న పార్టీలకు పోవడమే చాలా ప్రమాద మంటుంది జోన్. ఎందుకంటే పదిమంది చేరితే పరిస్థితులు చెయిజారిపోతాయి. అమ్మాయితనుని గ్రహంకోల్పోయే ప్రమాదముంది!

ఇటాలియన్ల పేర్లు రాబర్టో, మారియో

వాళ్లు చెప్పిన చోటుకి వచ్చి, నన్ను కారులో ఎక్కించుకున్నారు. నేనా కారులో ఎక్కేసరికి అందులో నేను అనుకున్నట్టు జోన్ లేదు. నా గుండెలు జారిపోయాయి. మరో మూడో ఇటాలియన్ ఉన్నాడు. కారు వాయువేగంతో పోతోంది. నేను ఒక్కర్తినే! ముగ్గురు మగాళ్ళ మధ్య. మైగాడ్ (సశేషం)



ఆకలి బాధ ఓర్వలేనిది... కాని చౌక భోజనంతోనే గడపాలి...

# వంటలు

## గోధుమలతో మరికొన్ని రకాలు

### కాజాలు:

కాజాలను తీపి కాజాలు, కారం కాజాలుగా రెండు రకాలుగా చేసుకోవచ్చు. మొదట కారం కాజాలు చెపుతాను. మెత్తగా జల్లించిన గోధుమ పిండిలో తగినంత ఉప్పు, కారం వేసి పూరీల పిండి మాదిరి కలుపుకోవాలి. కలిపిన పిండిని పెద్ద నిమ్మకాయలంత ఉండలు చేసుకోవాలి. ఉండను పూరీ పీటమీద పీట వెడల్పున వత్తాలి. పూరీని మరీ పలుచగాకాక ఒక మాదిరిగా వత్తాలి. చిన్న పూరీ పీట ఉన్నవాళ్ళు ఉండ సైజు తగ్గించాలి. వత్తిన పూరీని పీటమీదనే ఉంచి డైమన్ ఆకారంలో కొయ్యాలి. ఈ బిళ్ళలను నూనెలోకాని డాల్డాలోకాని ఎర్రగా వేయించాలి. బాణలి సైజును బట్టి బిళ్ళలు వెయ్యాలి. చిన్న బాణలిలో ఎక్కువ బిళ్ళలు వెయ్యకూడదు. అటుల వేసిన బిళ్ళలు బాగుగా వేగక కటుకుబారుతవి. కనుక తక్కువ బిళ్ళ వేసిన బాగా వేగి కరకరలాడుతవి. ఇవి రుచిగా నుండుటయేకాక వారం రోజులు నిలువ ఉంటవి.

### తీపికాజాలు:

ఈ తీపి కాజాలు కూడా కారపు కాజాలు మాదిరే చేసుకోవాలి. కాని పిండి కలిపేటప్పుడు ఉప్పు, కారం బదులు పంచదార వెయ్యాలి. గ్లాసెడు పిండికి సుమారు 5, 6 చెంచాల పంచదార వెయ్యాలి. తియ్యగ ఉంటవికదా అని ఎక్కువ పంచదార వేసేరు! పిండిపీటకు అతుక్కొని పూరీ ఆకారమే రాదు. కనుక తగినంత పంచదార వెయ్యాలి.

### మడతపూరీలు:

వీటికి కూడా పిండి పూరీల పిండి మాదిరే కలుపుకొని పెద్ద నిమ్మకాయంత ఉండలు తీసుకొని పూరీపీటమీద మరీ పలుచగా కాకుండా ఒక మాదిరిగా వత్తుకోవాలి. అంటే పూరీని పెద్ద సైజుగా వత్తాలి. వత్తిన పూరీని నాలుగు మడతలువేసి వత్తాలి. వత్తిన దానిని మరల నాలుగు మడతలువేసి వత్తాలి. మడత పూరీని నెయ్యిలోకానీ, డాల్డాలోకానీ ఎర్రగా వేయించాలి. ఈ మడత పూరీలు తయారుచేసేముందే వేరే పొయ్యిమీద పంచదార పాకం పట్టి ఉంచుకోవాలి. పాకంలో చిటికెడు మిఠాయి రంగు కూడా వెయ్యాలి. వేగిన మడత పూరీని పాకంలోవేసి 5 నిమిషాలు పాకంలోనే ఉంచాలి. పూరీపాకం పీల్చిన తర్వాత పళ్లెంలో వేసుకోవాలి. ఈ మడత పూరీలు 2 రోజులుకంటే నిలువ ఉండవు.

-వి. ఆర్. వసంత ★

## పచ్చికొబ్బెరతో భక్ష్యములు

# వంటలు

కావలసిన వస్తువులు -

1 పచ్చి కొబ్బెర చిప్పలు ఆరు
2 మంచి గోధుమపిండి 300 గ్రాములు.
3 వేయించిన శనగపప్పు 100 గ్రాములు (బజార్లో అమ్ముతారు)
4 కుసుమనూనె లేక డబుల్ రిఫైండెడ్ వేరుశనగనూనె 50 మి లీటర్లు.
5 బూరాచక్కెర 400 గ్రాములు.
6 గసాలు 10 గ్రాములు.

తయారుచేయు విధము:-

తొలుత 100 గ్రాముల వేయించిన శనగపప్పు (ఇవి బజారులో శనగలు బట్టీలలో వేయించిన శనగపప్పు అమ్ముతారు) విసిరి, జల్లించి పప్పులపిండిని వేరుగా యుంచుకొనవలెను.

పచ్చి కొబ్బెర చిప్పలు ఆరింటిని మెత్తగా కోరి, కోరిన తురుము, 400 గ్రాముల బూరా చక్కెర, తయారైన పప్పులపిండి, రోటిలో వేసి (నీరు చల్లకుండ) మెత్తగా రుబ్బవలెను. దీనినే "పూర్ణము" అందురు. ఈ పూర్ణమును బాగా పండు సైజులో ఉండలుగాచేసి ఒక బిళ్ళలో యుంచుకొనవలెను.

మంచి గోధుమపిండిని 300 గ్రాములు చపాతీల పిండివలె తడిపి శుభ్రమైన బండమీద తడిపిన పిండిని మెత్తగా రోకలిని త్రిప్పి నలుగగొట్టవలెను. నలుగగొట్టునపుడు కొద్దిగా నీరు బదులు కొద్దిగా నూనె పిండికి తుడువవలెను. తర్వాత ఒక వెడల్పాటి గిన్నెలో పిండి ఉంచి, పైన కొంచెము నీరు కొంచెము నూనె చల్లి, తడిగుడ్డ కప్పి 5 నిముషములు ఉంచుకొనవలెను.

ఇప్పటి పదార్థములన్నియు తయారు చేయుటకు రెడీగ యున్నవన్నమాట.

రేకుల పీటపై భక్ష్యముల రేకు, కుసుమనూనెగాని డబుల్ రిఫైండ్ వేరు శనగ నూనెగాని తుడిచి, తడిపి ఉంచుకొన్న గోధుమపిండి చిన్న నిమ్మకాయంత సైజు తీసుకొని గసాలలో అద్ది రేకుపై అరచేతి వెడల్పున తట్టవలెను. దీని మీద మన మిదివరకే తయారుగా యుంచుకొన్న పూర్ణపు ముద్ద నొకదానిని ఉంచి చుట్టూ ఉన్న గోధుమరేకుతోనే కప్పి ఒక చెంచాడు నూనె దీనిపై వేసి అరచేతితో భక్ష్యమును రేకు ఎంత వెడల్పు ఉన్నదో అంత వెడల్పు సాగదీయవలెను.

కాలిన పెనముమీద రేకు బోర్లించి జాగ్రత్తగా రేకుపైనున్న భక్ష్యము పెనముమీద పడునట్లు చేతితో వేయవలెను. ఈ భక్ష్యముపైన కొద్దిగా నూనె చల్లి కాలిన తర్వాత రెండవ వైపు త్రిప్పి కాల్చి తీసివేయవలెను. ఈ విధముగా పై నిచ్చిన కొలతలకు సుమారుగా 15 భక్ష్యములు తయారగును. జాగ్రత్తగా ఉంచితే 5, 6 రోజులు సహితం నిలువ యుంటాయి. నెయ్యి, వేడిపాలు వేసుకొనితింటే మరలా తినబుద్ధేస్తుంది. మీరు చేసి చూడండి (శనగపప్పు, కంది పప్పు వాటికంటే రుచిగాయుంటాయి)

గమనిక — భక్ష్యముల రేకు లేనివారు అరటి ఆకుగాని, కాగితముగాని వాడవచ్చును.

— శ్రీ. వెంకటలక్ష్మిదేవి ★
















**22-1-1965 శుక్రవారం మొదలు**

**28-1-1965 గురువారం వరకు.**

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | రా | |
| శ | **వారఫలం** | | |
| ర | **మహేష్** | | |
| బు శు | కే | | చం కు |

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం వృత్తి వ్యాపారాల్లో మీకు నష్టం రాకపోవచ్చునుగాని ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడగల సూచనలు ఉన్నాయి నూతన వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది వృత్తిలో మీ ప్రయాసకు తగిన ప్రయోజనం లభించదు ఉద్యోగంలో అధికారులతో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును మిత్రులతోనే కలహప్రసంగం రాగల సూచనలు ఉన్నాయి కాబట్టి వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు వారం మధ్యలో చేసే ప్రయాణాలు కొంతవరకు ఫలించవచ్చును ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది బంధువర్గంలో ఖ్యాతి లభిస్తుంది వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)**

ఈవారం కూడా అంత అనుకూలంగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు వ్యాపారంలో మీరు ఏమాత్రం నిర్లక్ష్యంగా ఉన్నా ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లో కూడా మరల చిక్కులు రావచ్చును భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి వృత్తిలో పోటీవారితో పోటీ అధికం కావడంవలన మీ కార్యక్రమాలను పునరాలోచన చేయవలసి వస్తుంది ఉద్యోగంలో మీరు ఇతరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నించడంవలన అనవసరమైన శ్రమకు గురికాగలరు. ఆర్థిక వ్యవహారాలు మాత్రం అనుకూలంగానే ఉండగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

## మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)**

ఈ వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాల్లోను ప్రోత్సాహం లభించినప్పటికీ వారాంతంలో అకస్మికంగా అవాంఛనీయమైన పరిస్థితి ఏర్పడగల సూచనలు ఉన్నాయి. భారీఎత్తున చేసే వ్యాపారాల్లో అనుకూల వార్తలను వింటారు వృత్తిలో ఇతరుల వాగ్దానాలను నమ్మి ఏ వ్యవహారమూ ప్రారంభించడం మంచిదికాదు ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావచ్చును. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడడంవలన మీ అభివృద్ధిమార్గం నిష్కంటకం కాగలదు మృగశిరా నక్షత్ర జాతకులకు వారాంతంలో చాలా బాగుంటుంది

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా జరగకపోవచ్చును. సంతోషకరమైన వార్తలను వింటారు.

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

ఈవారం వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులులేకుండా సాగిపోతాయి భాగస్వాములతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. వెంటనే ప్రతిఫలం లభించని వ్యవహారాల్లో కొంత వ్యయం చేయడంవలన ఆర్థికంగా కొంచెం ఒత్తిడి రావచ్చుగాని మీ సమయస్ఫూర్తివల్ల అన్ని వ్యవహారాలు ఏదో ఒకవిధంగా పరిష్కరించుకొంటూ తగినంత అభివృద్ధిని సాధించగలరు వృత్తిలో పోటీవారిలో గౌరవం లభిస్తుంది ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం స్త్రీ మూలంగా కలహప్రసంగం రావచ్చును

స్త్రీలకు— కుటుంబవ్యవహారాలు బాగాఉంటాయి వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఈవారం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, ఆర్థికంగా ముమ్ముందు మీకు విశేషంగా యోగించగల ఒప్పందాలు ఏర్పాట్ల విషయంలో తగినంత అభివృద్ధిని సాధించగలరు భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వతంత్రంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో ఉద్యోగంలో మార్పులకోసం మీరు చేసే ప్రయత్నాలు ఫలించవచ్చును ఆరోగ్యం బాగానే ఉంటుంది మఖా నక్షత్ర జాతకులకు మాత్రం ఈవారం అంత బాగా ఉండదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది బంధువుల వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

## కన్య :

**(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది మీరు ఎంతో శ్రద్ధగా ప్రయత్నం చేసిన వ్యవహారాలకు ఆటంకాలు రావడం, మీరు నిరాశచెందిన వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగవచ్చును మీకు ఎంత ఇష్టంలేకపోయినా మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది వృత్తిలో గౌరవం బాగా ఉంటుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి గత వారంకంటే బాగా ఉన్నా, పూర్తిగా అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి.

## తుల :

**(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)**

ఈవారం మీ పరిస్థితి 'ఇంట్లోకి యిత్తడిపూస, బయటకు బంగారుపూస'' అనే సామెత ప్రకారం ఉంటుంది ప్రపంచం మిమ్మల్ని కార్యదక్షులుగా పొగడుతుంది కాని వృత్తి వ్యాపారాల్లో మీరు సాధించిన అభివృద్ధియేమీ ఉండ పోవచ్చును ప్రయత్నించిన ప్రతి వ్యవహారమూ నెరవేరుతున్నట్లే కన్పిస్తుంది కాని ఫలితం చేతికి రావటం మాత్రం కన్పించదు భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది ఉద్యోగంలో మీ పరిస్థితి గత వారంలో కంటే కొంచెం బాగా ఉంటుంది ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కొంచెం శ్రమ కలిగినా అనుకొన్నట్లుగా నెరవేరతాయి వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు

## వృశ్చికం :

**(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

మీరు ఎంత పొదుపుగా ఉందామని ప్రయత్నం చేసినా, వృత్తి వ్యాపారాల్లో అధిక వ్యయం చేయవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును కాని, అన్ని వ్యవహారాలు మీరు అనుకొన్నట్లుగానే నెరవేరడంవలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవచ్చును అధికారులవలన జరుగవలసిన పనులు సులువుగా నెరవేరడానికి అవకాశం ఉంది ఉద్యోగంలో కొంచెం కార్యభారం పెరగవచ్చును. కోర్టు వ్యవహారాలు సంతృప్తికరంగా

### ఈవారం ధరలు

అపరాల ధరలు నిలకడగా ఉంటాయి బెల్లం ధర పెరిగే సూచనలు ఉన్నాయి. పసుపు ధర కొంచెం పెరుగుతుంది. మిర్చి ధర తగ్గవచ్చును. నూనె, నువ్వుల ధరలు ఒడుదుడుకులకు గురికావచ్చును. వస్త్రాల ధరలు పెరుగుతాయి

# వారఫలాలు

ఉంటాయి సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగల సూచనలు ఉన్నాయి

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటికంటే బాగా ఉంటుంది శుభకార్యాల విషయాల్లో అభివృద్ధిని సాధించగలరు.

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలించడంవలన ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు మీరు వూహించినంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును సాహసముతో కూడిన వ్యవహారాల్లో వాదాంతంలో నష్టం రావచ్చును వృత్తిలో కొత్తవారితో పోటీ ఏర్పడగల సూచనలు ఉన్నాయి. ఈవారం మీరు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది వారం ప్రారంభంలో చేసే ప్రయాణాలు ఫలిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటె బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

## మకరం:

ఉషా 2, 3, 4 పా, (శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన లాభం రావలసిన వ్యవహారాలు కూడా వదులుకోవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును అధికారులవలన జరుగవలసిన పనులకు ఆఖరు క్షణంలో కొంత మంది వ్యక్తులు ఆటంకాలు కలిగించగల సూచనలు ఉన్నాయి. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు అంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును బంధువుల వ్యవహారాల్లో విజయాన్ని సాధించగలరు. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధిక వ్యయం జరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా జరగకపోయినా మొత్తంమీద ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి దీర్ఘకాలానికి ఫలితాన్నిచ్చే భారీ వ్యవహారాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి వృత్తిలో నూతన మార్గాలద్వారా ఆదాయం పెరుగుతుంది ఉద్యోగంలో మీరు ఇదివరకు చేసిన నిర్ణయాలవల్ల కొంచెం ఆందోళన కలుగవచ్చును నష్టం ఏమీ కలగదు కోర్టు వ్యవహారాలు అంత అనుకూలంగా ఉండకపోవచ్చును. ఆరోగ్యం ప్రశాంతం

బాగాఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు కూడవు.

స్త్రీలకు ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

**మీనం :**

**(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపారంలో ముమ్ముందు మీకు బాగా ఉపయోగించగల సంభాషణలు జరుపుతారు. వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో ఆదాయంతోపాటు వ్యయం కూడా పెరుగుతుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి పరిగణనలోనికి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో కొంచెం శ్రమమీద విజయాన్ని సాధించగలరు. ఆడంబరంకోసం వ్యయం చేయవలసి వస్తుంది. నటీనటులకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు. 

# జన్మదినఫలం

## జనవరి–22

ఈ సంవత్సరం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు ఏర్పడడంవలన తరువాత కొంత అభివృద్ధిని సాధించినా మొత్తంమీద అంత సంతృప్తికరంగా ఉండదు. వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు ఇంద్ర ధనుస్సువలె ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని వాటిని సాధించడానికి ప్రయత్నించడంవలన అనవసరమైన వ్యయ ప్రయాసలకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కొంచెం శ్రమమీద యథాతథ స్థితిని కాపాడుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల బలం పెరగ వచ్చును. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. శుభ కార్యాల విషయంలో మీ ఆలోచనలు ఫలించవచ్చును. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## జనవరి–23

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో అనుభవం తక్కువ ఆడంబరం ఎక్కువ అనే పరిస్థితి ఏర్పడవచ్చును. వ్యాపారంలో మీరు క్షణం కూడా తీరుబడి లేకుండా పని చేయువలసి వస్తుంది కాని దానివల్ల మీరు అదనంగా సంపాదించే ప్రయోజనం ఏమీ ఉండదు. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు లేనిపోని ఆశలు కల్పించి మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహించవలసి వస్తుంది. ఇతరులకు మీరు సహాయం చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. ముఖ్యమైన వ్యవహారాల్లో మీకు సమయానికి విశ్వాసపాత్రులైన మిత్రుల సహాయం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## జనవరి–24

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో కొన్నివ్యవహారాల్లో అధిక వ్యయం జరిగినా తగిన ప్రయోజనం కూడా ఉంటుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగాచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రస్తుతం అంతబాగా లేకపోయినా రాను రాను అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా సంవత్సరాంతంలో లాభించవచ్చును. మీ అభివృద్ధికి ఆటంకంగాఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కాగలవు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావచ్చును. రావలసిన డబ్బుమీద ఆధారపడి వాగ్దానాలు చేయడం మంచిదికాదు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## జనవరి–25

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులను పరిష్కరించడంలో మీరు నిమగ్నులయిపోవడంవలన వృత్తి వ్యాపారాల్లో తగిన శ్రద్ధ చూపించడానికి అవకాశం లభించదు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. వృత్తిలో మీ కార్యక్రమాలకు ఆటంకాలు వస్తూ ఉంటాయి కాని నష్టం కలగక పోవచ్చును. ఉద్యోగంలో అవస్థమీది అనుభవం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడవచ్చును. స్థిరాస్థి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలెత్తవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## జనవరి–26

ఈ సంవత్సరం మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోయినా వృత్తి వ్యాపారాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోవడంవలన మొత్తంమీద సంతృప్తికరంగానే ఉంటుంది. మీకు అంతగా ఇష్టం లేకపోయినా, కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వంవంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది. భాగస్వాములతో ఇదివరకు ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభించకపోయినా ప్రస్తుతపు వ్యవహారాల్లోనే ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది. ఉద్యోగంలో స్థానచలనం కలగవచ్చును. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో శ్రమపడినా నిమ్మారం వస్తుంది. విలువైన వస్తువులు కొంటారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## జనవరి–27

సంవత్సరం ప్రారంభంలో వృత్తి వ్యాపారాలలో ఏర్పడే చికాకులవలన వ్యయ ప్రయాసలకు గర్మి అయినా, సంవత్సరాంతానికి పరిస్థితులు చక్కబడడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. మీకంటే పెద్దవారు కూడా వ్యాపారంలో మీ అభిప్రాయాలను ఆమోదిస్తారు. నూతన వ్యాపారాలు లాభించగల సూచనలులేవు. వృత్తిలో సంవత్సరాంతంలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో మార్పులకోసం మీరుచేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. భిన్నాభిప్రాయాలుగల బంధువులను ఒకదారికి తీసికొనిరాగలరు. విద్యార్థులు సులభంగా కృతార్థులు కావచ్చును. వ్యవసాయదారులకు కళాకారులకు అనుకూలమైన సమయం.

## జనవరి–28

వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగానే ఉన్నా కొంతమంది సన్నిహితులతో భేదాభిప్రాయాలు రావడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. వ్యాపార విస్తరణ ప్రయత్నాలకు ఇదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. అధికారులవలన జరగవలసిన పనులు సులభంగా నెరవేరగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ముమ్ముందు విశేషంగా లాభించగల ఒప్పందాలు, ఏర్పాట్లు జరగడానికి అవకాశం ఉంది. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలు జరిపి అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. స్థిరాస్తి వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. గృహనిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాలు నెరవేరతాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. 

# పాఠం నేర్పిన పాఠం

వ్యాఘ్రభాష్యం సూరీడు



ఈ కథ మీకు వ్రాయాలని ఎన్నాళ్ళనుండో అనుకుంటున్నాను. ఇంతవరకు ఆలస్య మవడానికి రెండే రెండు కారణా లున్నాయి ఒకటి, ఇది మా అక్కయ్య కథ అవడంవల్ల, ఆమె అనుమతి తీసుకోకుండా మీకీ కథ వ్రాయదల్చుకోలేదు. తన అనుమతి నివ్వమంటూ అప్పుడే చాల రోజుల క్రితం అక్కయ్య కొక ఉత్తరం వ్రాశాను. అక్కయ్య నుండి అనుకూలమైన జాబు వస్తుందని నాకు ధైర్యముంది. కాని, మొన్నటివరకు అది రాకపోయేసరికి, ఈ కథ వ్రాయడం అనవసర మనుకున్నాను అదృష్టవశాత్తూ నిన్ననే నే ఎదురుచూచిన జాబు వచ్చింది ఇంక రెండో కారణం చెప్తాను—నే చెప్పబోయే కథ కార్తీక పౌర్ణమి నాదినంతో ప్రారంభమవుతుంది అందుకని అదే రోజున ఈ కథ వ్రాయాలని నా కోరిక! అక్కయ్య నుండి నే వాశించిన అనుమతి నిన్ననే రావడం, ఈరోజున కార్తీక పౌర్ణమి అవడం, మీకీ కథ వ్రాయమంటూ, నన్ను ప్రోత్సహించాయి

ఈ కథ చెప్పేముందు, ఇందులో వ్యక్తులను కొంచెం మీకు పరిచయం చెయ్యడం అవసర మనుకుంటాను. ఇది ఐదేళ్ల క్రిందట జరిగిన కథ. అప్పటికి మా అక్కయ్య వయస్సు ఇరవై యేళ్ళు, బి. ఏ. ఫైనలియరులో ఉండేది. నేను దానికంటే

మూడేళ్ళు చిన్న. ఇంటర్మీడియెట్ రెండో సంవత్సరంలో ఉండేదాన్ని

"సుందరమూర్తి" గారు మా కాలేజీలో (లెక్కల) లెక్చరర్‌గా ఉండేవారు మా యింటి ప్రక్క నున్న బంగళాలోనే ఆయన ఉంటూండడంవల్ల, మా నాన్నగారిపై ఆయనకుండే గౌరవభావం వల్ల, మరెవ్వరికీ కాకపోయినా, అక్కయ్యకు మాత్రం ఆయన ప్రైవేటు ట్యూషన్ చెప్పేవారు ముచ్చటైన ముప్ఫైఏళ్ల ఆయన విగ్రహం, ఆయన పేరుకు తగ్గట్టుగానే ఉండేది. ఆయన్ను ఎక్కడ చూచినా, సాధారణంగా స్కూటరులోనే కనుపించేవారు ఎర్రని ఎరుపు, తెల్లని తెలుపు—ఈ రెండు రంగుల కలయికతో, ఎప్పుడూ మెరుస్తూ కనిపించే స్కూటర్‌మీద, ఠీవిగా ఆయన కాలేజి ఆవరణలో ప్రవేశిస్తే, ఆడపిల్లలందరి దృష్టి అటువైపే మళ్ళేది అన్ని విషయాల్లోనూ ఆయన ఆధునిక యుగానికి చెందిన మనిషిలాగే కనుపించినా, ఒక్కొక్కప్పుడు ఆయన ప్రవర్తనలో ఏదో ప్రత్యేకత ఉట్టిపడేది ఆయనకు ఎక్కువ స్నేహితులు లేరు ఎప్పుడు చూసినా, ఎక్కడ చూసినా, ఒంటరిగానే, ఆ ఎర్ర స్కూటర్‌తో కనుపించేవారు!

ఆయన భార్య 'సుశీల' గారు కూడా చాలా ఆకర్షణీయంగా కనుపించేవారు ఆమె ప్రవర్తనలోను, రూపులోను, నవనాగరికత ఉట్టిపడేది మావూరు మహిళామండలికి ఆమె కార్యదర్శిగా ఉండేది సంగీతం వచ్చు రేడియో ప్రోగ్రాములు కూడా ఇచ్చేది సుందరమూర్తిగారికి ఆమె ఏ విషయంలోనూ తీసికోపోదు అనిపించేది మేము ఆవిణ్ణి 'సుశీలమ్మ' గారని పిలిచేవాళ్లం

అయితే, వాళ్ల ఇంటికి వెడితే తప్ప, మరెక్కడా ఆ ఇద్దర్నీ కలిసి చూడ్డం కష్టమయేది ఆమెను చూడాలంటే, చాలా సులభం—సాధారణంగా రేడియో స్టేషన్ దగ్గర కనుపించేది మహిళాసభలు ఏవైనా ఉంటే, ఆమె అక్కడ తప్పకుండా హాజరయేది ఎప్పుడు చూసినా, బిజీగా మాత్రం అగుపించేది

మరి ఆయన సంగతి—

నేనూ, అక్కయ్యా ఏదో సందేహ నివృత్తి కోసం ఓసారి ఆయన రూమ్‌కి వెళ్ళాం (కాలేజీలో!) మేడమీదనున్న ఆయన గది, రెండు లేబరేటరీల అవతల, ఓ చివ్వరగా ఉండేది తలుపు సగం తెరిచిఉంది లోపలకు తొంగిచూశాము 'కీబొమ్మ' నొకదాన్ని టేబుల్‌మీద ఆడిస్తూ ఏదో ఆలోచనలో నిమగ్నులయారు మేష్టారు ప్రక్కనేవున్న 'రికార్డ్ ప్లేయర్' సన్నగా పాడుతోంది గుమ్మం దగ్గర మేం నిలబడి ఓ పది నిముషాలపైన అయ్యింది మూడు రికార్డులు మారాయి ఆయన మాత్రం ఆలోచనా ప్రపంచంలోనే ఉండిపోయారు తలుపు చప్పుడు చేశాం లాభం లేకపోయింది రికార్డ్ ప్లేయర్‌లో ఐదవ ప్లేటుపాడడం మొదలెట్టింది చేసేదిలేక 'మేష్టారూ!' అని కొంచెం గట్టిగా పిలిచాను తృళ్ళిపడి మా వేపు చూశారు మేష్టారు "ప్లీజ్ కమిన్" అని ఆయన ఆహ్వానించడానికి మరో అర నిముషం పట్టింది!!

మరోసారి— ప్రిన్సిపాల్‌గారి బొటానికల్ గార్డెన్స్ చూద్దామని నేనూ, అక్కయ్యా, మరో ముగ్గు రమ్మాయిలతో కలిసి వెళ్ళాము దూరంగా ఎర్ర స్కూటర్ కనుపించేసరికి కొంటెతనంగా ఆయన్ను ఏడిపిద్దామని అయిదుగురం అటువైపే మళ్ళాం ఆయనకు ఓ ఇరవై గజాల దూరంలో ఆగాము ఓ చిన్న 'లోటస్ పాండ్' ప్రక్క సిమెంటు రాతిమీద కూర్చున్న మేష్టారు ఏ లోకాల్లో సంచరిస్తున్నారో ఆయనకే తెలియాలి! ఆయన దృష్టి మరల్చాలని, మాలో మేమే గట్టిగా మాట్లాడుకున్నాం అల్లరిచేశాం కిలకిలా నవ్వాము ఆయనలో కించిత్తు కూడా చలనం కనుపించలేదు మమ్మల్ని మేమే చిన్నబుచ్చుకున్నట్లయింది ఏదారిన మేం వెళ్ళిపోయాం!

పాత్ర పరిచయంలోనే కాలం వృథా చేస్తున్నందుకు క్షమించాలి! ఈ రెండు సంఘటనలు నేను ఒక కారణంతో చెప్పవలసి వచ్చింది— ఆ వయసులో, ఆ విగ్రహంలో, ఆ అంతస్థు ఉన్న మరే వ్యక్తి అయినా, ఆయనలా ప్రవర్తించేవాడు కాదని, సుందరమూర్తిగార్ని ఎప్పుడు చూచినా అనుపించేది ఆయనలోని ఆ ప్రత్యేకతయే ఈ కథకు మూల కారణమనుకుంటాను

ఇంక అక్కయ్యను కథలోనే కలుసుకుందురు గాని నా పేరు చెప్పడం మరచాను—'సరస్వతి'

* * *

ఆనాడు కార్తీక పౌర్ణమి మధ్యాహ్నమనగా మా స్నేహితురాలింటికి వెళ్ళిన నేను, ఎంత ప్రయత్నించినా, రాత్రి ఎనిమిదయితేగాని ఇల్లు చేరుకోలేకపోయాను అమ్మ ఎక్కడ తిడుతుందోనని భయపడుతూనే ఇంట్లో అడుగు పెట్టాను. అమ్మకు తెలియకుండానే స్నానం ముగించుకొని, పట్టు చీరతో పెరట్లోకి వెళ్ళాను తులసికోటను ఇంకా అలంకరిస్తూనే ఉంది అమ్మ దీపకాంతిలో అపర మహాలక్ష్మిలా కనుపించింది తులసికోట నిండా వేయి దీపాలు వెలుగుతున్నాయి అన్ని దీపాలమధ్య రమ్యంగా ప్రకాశిస్తోంది కాయలతో బరువుగానున్న ఉసిరికొమ్మ!

మెల్లిగా అమ్మ పక్కకుచేరి, దీపాలు సర్దటం మొదలెట్టాను అమ్మ మంచిది! తిట్టలేదు అక్కయ్యచేత అప్పటికే పూజ చేయించేసిందట! నా చేత కూడా చేయించింది ప్రసాదం పళ్లెం ఇస్తూ మాత్రం అంది—"ఇవాళ కూడా ఇంత లేటుగా రావాలంటే! నీ చదువూ నువ్వేగాని, ఆడదాని లక్షణా లేమాత్రం కనుపించవు నీలోను! సరోజ చూడు, పెందరాళేవచ్చి నా కెంత సహాయం చేసిందో!"

ప్రసాదం పళ్లెం పుచ్చుకొని, అమ్మపెట్టిన చివాట్లు మింగేసి, అక్కయ్యకోసం మేడమీదకు వెళ్తున్నాను. మేడమెట్లు ఎక్కుతూ ఒక్కక్షణం అలాగే నిలబడిపోయాను మేడమీదగదిలో, కిటికీ ప్రక్కన నిలబడింది అక్కయ్య! కచ్చాపోసి కట్టిన పట్టుచీర వెన్నెలలో ధగధగా మెరుస్తోంది అంతకంటె మృదువుగా మెరుస్తోంది అక్కయ్య విగ్రహం ఆ చీరలో! ఆమె అందం నాకే అసూయ కలిగించింది 'అందుకే లాగుంది, అక్కయ్య అసలైన ఆడదని అమ్మ దాన్ని ఎన్నోసార్లు మెచ్చుకుంటుంది' అనుకున్నాను మనసులో రెప్పవాల్చకుండా కిటికీ బయటకు చూస్తోంది అక్కయ్య! ఎప్పుడు కాకుండా ప్రసాదం పళ్లెం టేబుల్ మీద ఉంచి, ఆమె ప్రక్కకు చేరాను ఏం చూస్తోందో తెలుసుకుందామని!

ప్రక్కనున్న బంగాళా పున్నమి చంద్రుని వెండి వర్షంలో తడుస్తూ ప్రశాంతంగా కనుపిస్తోంది ఆ భవనం చుట్టూ ఉన్న పొట్టి కొబ్బరి చెట్లు దాని కెంతో అందాన్ని చేకూరుస్తున్నాయి. కొబ్బరి ఆకులు పిల్ల వాయువుకు మెల్లిగా కదులుతుంటే, చంద్రకాంతి వాటిపై దోబూచులాడుతోంది భవనం ముందున్న పూలతోట ఆ వెన్నెలలో మరింత రమ్యంగా ప్రకాశిస్తోంది ఆ అందాన్నంతనీ చూసేలాగుంది అక్కయ్య, అంత దీర్ఘంగా ఆలోచిస్తోంది' అనుకున్నాను. మరుక్షణంలోనే నన్ను నేను సవరించుకోవలసి వచ్చింది—ఆ పూలతోటమధ్య మడత కుర్చీలో కూర్చుని అదే ధ్యాసగా ఆకసంవంక చూస్తున్న సుందరమూర్తిగారు నా కళ్ళబడేసరికి! ఒక్కసారిగా ఆశ్చర్యం ముంచుకొచ్చింది. అక్కయ్యమీద అసహ్యం కూడా కలిగింది అక్కయ్య అక్కడ ఎందుకు నిలబడిందో అర్థం చేసుకుని, టేబుల్ దగ్గరకు వచ్చేశాను ఏం జరుగుతుందో చూద్దామని అయిదు నిముషాలు అలాగే నిలబడ్డాను ఏమీ జరగలేదు! అక్కయ్య అటువైపు చూస్తూనే ఉంది! మడత కుర్చీలో కూర్చుని ఉన్న మేష్టారు ఆకసంవంక అలాగే చూస్తూ ఉన్నారు!!

ఆవెన్నెల రాత్రిలో, ఆ ప్రశాంతతలో ఆ రెండు మనసులు ఏయే లోకాల్లో సంచరిస్తున్నాయో తెలుసుకోలేక తికమక పడ్డాను

అలాంటి ఇరకాటకంలో పడడం అది మొదటిసారికాదు నాకు. రాను, రాను ఆయనమీద అక్కయ్య ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నట్లు తోచింది. ఇంక ఉపేక్ష చేయడం మంచిదికాదనుకొన్నాను. 'పాపం, అక్కయ్యమాత్రం ఏం చేస్తుంది, ఆమె వయస్సు అలాంటిది!' అనిపించింది మరుక్షణంలో! ఎలాగైనాసరే, అక్కయ్యకు చిన్న 'వార్నింగ్' లాంటిది ఇవ్వడం మంచిదనుకొన్నాను మెల్లిగా వెనుకనుండి వెళ్ళి, ఆమె రెండు కళ్ళూ మూశాను ఆమె కన్నీటితో నా రెండు చేతులు తడిసిపోయేసరికి ఆశ్చర్యపడవలసి వచ్చింది

"ఏమిటే సరోజా? ఏమిటిదంతా? పండుగ పూటా కళ్లమ్మట నీళ్ళెందుకు?" అన్నాను అక్కయ్యను కుర్చీలో కూర్చోపెడుతూ!

కొంచెం తడబడింది అక్కయ్య! కన్నీటిని తుడిచేసుకుని 'ఏమీ లే'దంటూ సమాధానమిచ్చి నన్ను మభ్యపెట్టడానికి "అప్పుడే నీ పూజ అయిపోయిందా?" అంటూ ప్రశ్నించింది

"నా పూజ అయ్యి అప్పుడే పది నిముషాలవుతోంది అమ్మ ప్రసాదం పంపించింది" అంటూ ఆ పళ్లెం అక్కయ్య చేతులో ఉంచాను డ్రాయరులోంచి, చాకుతీసి జామిపళ్లు కోస్తోంది అక్కయ్య కమలా ఫలం వలుస్తూ ప్రక్కనే కూర్చున్నాను నేను ఓ రెండు నిముషాలు నిశ్శబ్దం! అక్కయ్యే ఆ విషయం ఎత్తుతుందని చూశాను ఆ సంగతి

# పాఠంనేర్పిన పాఠం

నా కేవలం ఆరాధించుకుందేమో— ఏమీ మాట్లాడ లేదు అక్కయ్య!

నేనే అడిగాను—"నీతో ఉన్న చనువుకొద్దీ అడుగుతున్నాను సరోజా! మరోలా అనుకోకు! నువ్వెందుకే ఆయనంటే అంత శ్రద్ధ తీసుకుంటావు? ఆయన కనీసం బ్రహ్మచారి కూడా కాదే! పోయి, పోయి ఆయనమీదకే నీ మనసెందుకు పోవాలి? ఈ విషయం అమ్మకు తెలిస్తే ఏమవుతుందో ఆలోచించావా?"

"పొరపాటు పడుతున్నావ్ సరసీ!" అంది అక్కయ్య సావకాశంగా—"చిన్నదానివి! మనుషుల్ని అర్థం చేసుకునే శక్తి ఇంకా నీకు లేదు"

తన పెద్దరికాన్ని వెళ్లబుచ్చుతూ, అక్కయ్య నన్ను చిన్న బుచ్చడం నాకు నచ్చలేదు కొంచెం కోపం కూడా వచ్చింది అడగదలుచుకున్నదేదో అడిగేశాను "విక్షేపంలాంటి భార్యాభర్తలు వాళ్లను చూసే ఊరంతా మురిసిపోతోందని నీవు సహించలేకుండా ఉన్నావేమో! పోయి పోయి ఆయన గురించే కనాలా నీ కలలన్నీ!"

తొందరపాటు లేకుండా నన్ను బుజ్జగిస్తూ చెప్పింది అక్కయ్య—"అందుకే నీవు చిన్న పిల్లవన్నాను. వాళ్లది విక్షేపంలాంటి సంసారమని అందరూ భ్రమపడతారు అదే పొరపాటు ఈ విషయాన్ని ఇంకో వైపునుండి చూడు నీ కర్థమవుతుంది! ఆయనకు తగిన భార్యలా కనుపిస్తుందా ఆ సుశీలమ్మగారు? ఎప్పుడూ నిర్వీర్యంగా ఉంటుంది ఇంట్లో వంట గొడవగాని మరే గొడవగాని సమంగా చూసుకోదు ఇంటికి ఎప్పుడో వస్తుంది ఎప్పుడో పోతుంది అమాయకులు ఆ మేస్టారి సంగతి అసలేమీ పట్టించుకోదు అంత విలువైన మనిషికి సేవ చేసుకోలేని ఆమెదీ వో జీవితమేనంటావా? నువ్వు కూడా ఆలోచించి చూడు. ఏదో ఒక సాంసారికమైన చింత ఆయన్ను వేధిస్తూ ఉండాలి! లేకపోతే ఎందుకాయన అలా ఆలోచనా ప్రపంచాల్లో విహరిస్తుంటారు? తీరని అనుభూతి దేనికోసమో ఆయన కలలు కంటూ ఉండి ఉండాలి!"

ఆయనకు ఎంతో విలువ ఇచ్చేది అక్కయ్య! అందుకే ఆమె కా ఆలోచనలన్నీ! నాలాంటి చాలామంది అమ్మాయిలు ఆయన్నుచూసి నవ్వుకునేవాళ్లం, ఎప్పుడూ 'అబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్'లా కనుపిస్తారని! అక్కయ్యమాత్రం ఆయన్ను అర్థం చేసుకోడానికి కొంచెం శ్రమపడింది. ఆయన అలా ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చోడం తను చూడలేనంది. సుశీలమ్మగారికి ఏలాగోలాగ బుద్ధి చెప్పాలని నిశ్చయించుకున్నానంది

అప్పటికిగాని అక్కయ్యమీద కోపం చల్లారలేదు నాకు. అక్కయ్యతో ఆ విషయంలో ఏకీభవించకుండా ఉండలేకపోయాను. అంతటితో ఆ సంగతి వాలిద్దామనుకున్నాను.

అక్కయ్య జాలిగా చెప్పింది—"ఆయన ఎంతో మంచివారు! అపారమైన తెలివి! అలాంటాయన అనుభవించవలసిన సుఖమా ఇదంతా? వారానికి అధమం రెండు రోజులైనా ఏ హోటల్లోనో లంచేస్తారు"

అక్కయ్య ధోరణి నాకు అయోమయంగా కనుపించింది. "అయితే మనమేం చేస్తాము సరోజా! ఆయన ఖర్మంకొద్దీ అలాంటావిడ దొరికిందేమో!" అన్నాను

"ఖర్మం అని చూస్తూ ఎలా ఊరుకోగలమే? ఆవిడకు కొంచెం బుద్ధి చెప్పి, సంసారంమీదకు దృష్టి మరల్చుకునేలా చూడడం మన కర్తవ్యం కాదంటావా చెప్పు?"—అక్కయ్య నిశ్చయం నా కదోలా అనుపించింది

"పెళ్ళికానిపిల్లవు నీ కెందుకే వాళ్ల గొడవలన్నీ? నువ్వు తెగించి ఆవిడకు ఈ విషయాన్ని చెప్తే, కథను ఆవిడ మరోలా తిప్పేస్తుందనుకో! అప్పుడు నీ పరిస్థితి ఎంత అసహ్యంగా ఉంటుంది?" కొంచెంగా మందలించాను అక్కయ్య నాకంటె పెద్దదని మరచిపోతూ!

నేననుకున్నంత అమాయకురాలుకాదు అక్కయ్య! సుశీలమ్మగారిని దారిలో పెట్టడానికి తానొక కార్యక్రమం తయారు చేసుకుంది అదంతా నాకు వివరంగా చెప్పింది "సరే! బాగుంది!" అని అన్నానేకాని, అక్కయ్య అనవసరంగా ఇదంతా నెత్తిన వేసుకుంటోందేమోనని భయపడ్డాను.

మీ దగ్గర దాచడం ఎందుకు? ఇంకో విషయం కూడా చెప్తాను అక్కయ్యమీద నా అనుమానం నా కుండనే ఉంది—'దీనికంతకూ అక్కయ్య వయసే కారణం' అని!

అక్కయ్య వేసిన ప్లాను ఇది—తను రోజూ మేస్టారింటికి ట్యూషన్‌కి వెళ్లేది ఆ అవకాశాన్ని వినియోగించుకొని, సుశీలమ్మగారు చూస్తూ ఉండగా తను మేస్టారితో చాలా చనువుగా ప్రవర్తించాలి! ఆయన ఎదురుగుండానే ఆమెను చిన్నబుచ్చుతూ ఉండాలి! పైగా, సుశీలమ్మగారి సమక్షంలో ఆయన తనను రెండు మూడుసార్లు మెచ్చుకునేలా చూచుకోవాలి! ఒలాంటి కొన్ని సంఘటనల ద్వారా తనమీద సుశీలమ్మగారికి అసూయ కలగాలి! ఆవిడ క్రమంగా మేస్టారియందు ఆసక్తి చూపించాలి!

అనాడు అక్కయ్య చెప్పిన మాటలు ఇంకా నా చెవుల్లో వినిపిస్తూనే ఉన్నాయి—"ఏదో విధంగా ఇతరులకు మంచి చెయ్యడం మన కర్తవ్యం. అవకాశాలను వినియోగించుకొని, ఏదో ఒకటి సాధిస్తూ ఉండాలి! లేకపోతే జీవితం చప్పగా కనుపిస్తుంది కాదుటే!" అందుకే ఆమెను నేను తప్పుగా అర్థం చేసుకోలేదు. ఈనాటికి కూడా అక్కయ్యమీద నా కింత అభిమానం ఉండడానికి, ఆమెలోఉన్న ఇలాంటి ఆదర్శాలే కారణం!

* * *

ఆ మరునాడే తన కార్యక్రమం ప్రారంభించింది. అక్కయ్య! ఆరోజు తను ట్యూషన్‌కి వెళ్లేసరికి మేస్టారు స్నానానికి వెళ్లారుట సుశీలమ్మగారు బిజీగా ఏదో రాసుకుంటూ హాలులో కూర్చున్నారు అక్కయ్యనుచూసి ఎంతో సంబరపడుతూ, "సమయానికి వచ్చావు కొంచెం ఇది ఫెయిర్ కాపీచేసి పెడుదు సరోజా! మధ్యాహ్నం రేడియో ప్రోగ్రాముకు ఒక్కటి కూడా ఇంకా తయారు చేసుకోలేదు" అంటూ కొన్ని కాగితాలు అక్కయ్య చేతిలో ఉంచారు అక్కయ్యకు వళ్లు మండింది కాని, పాపం చేసేదిలేక రాయడం మొదలెట్టింది సుశీలమ్మగారు కుర్చీలోంచి లేస్తూ "అవతల ఇంకా వంట మొదలెట్టలేదు. ఈవంటావిడ ఒకత్తి నాకు తగినట్టుగానే దొరికింది. వారంలో రెండు రోజులు ఏదో కారణం చెప్పి ఎగేస్తుంది ఇంకో గంటన్నరకల్లా ఆయన కాలేజీకి వెళ్ళిపోవాలంటారు స్టౌ వెలిగించి వస్తాను అవి మాత్రం కొంచెం పూర్తి చేసి పెట్టు! అంటూ వెళ్లబోయారు.

"పాపం, ఆయనంటే ఎంత శ్రద్ధ ?" వ్యంగ్యంగా అందిట అక్కయ్య! సుశీలమ్మగారిని చిన్న షాక్ తినిపించాయిట ఆ మాటలు ఒక్క క్షణం అక్కడే నిలబడి, ఏదో చెబుదామనుకొని, చెప్పకుండానే వెళ్ళిపోయారుట!

* * *

మరోనాడు సాయంత్రం అయిదు గంటలకి ట్యూషన్‌కోసం మేస్టారింటికి వెళ్ళింది అక్కయ్య! కొంచెంగా చినుకులు పడుతున్నాయి మేస్టారింకా రాలేదు. సుశీలమ్మగారు యథాప్రకారం ఏదో రాసుకుంటూ కూర్చున్నారు. మరికొంచెం సేపటికి వర్షం ఎక్కువయింది వర్షంలో తడిసి ముద్దయి వచ్చారు మేస్టారు సుశీలమ్మగారు ఇంకా లేద్దామని అనుకుంటూండగానే అక్కయ్య గబగబా గొడుగు తీసికెళ్ళి ఆయన్ను లోపలికి తీసుకువచ్చింది ఆయన లోపలకు వచ్చాక, తువ్వాలు కోసం బీరువా తెరుద్దామని తాళంకోసం డ్రాయరు వెదుకుతోంది సుశీలమ్మగారు. దగ్గరలోఉన్న మరో తువ్వాలుతీసి, ఈ లోపున అక్కయ్యే ఆయనకు తువ్వాలు అందించింది "అయ్యయ్యో! ఎంతలా తడిసిపోయారో! ఇప్పుడు వర్షంలేనేలేదు ఆ వచ్చిన కాస్త వానా మిమ్మల్ని తడపడం కోసమే వచ్చినట్టుంది ఈ లుంగీ పంచ తీసుకొని, బట్టలు ముందు మార్చేసుకోండి! ఆతురత వెలిబుచ్చుతూ లుంగీ పంచ కూడా అందించింది! అప్పటికింకా సుశీలమ్మగారు బీరువా తెరవడం అవనేలేదు. "థ్యాంక్యూ వెరిమచ్" అంటూ అక్కయ్య ఇచ్చిన లుంగీ తీసుకుని, మేడమీదకు వెళ్ళిపోయార్య మేస్టారు పంచా చొక్కా తీసుకుని మేడమీదకు వెళ్ళేసరికి సుశీలమ్మగారికి మరో రెండు నిమ్ము

---

రామారావు : ఏరా గోపీ! మన కాలేజీలో ప్రతిమీటింగుకు ఉపన్యాసకులుగా 'ఫిలాసఫీ ప్రొఫెసర్'నే ఆహ్వానిస్తుంటారు!

గోపాలరావు : మైకు అరేంజి చేయాల్సిన అవసరం ఉండదురా!

పులిపాటి (తిరుపతి)

---

షిలు పట్టింది మేడ మెట్లెక్కుతున్న సుశీలమ్మగారి ముఖం వాడిపోయి ఉందట ఈ సంఘటనను వర్ణిస్తూ అక్కయ్య ఒకటే సంబరపడింది— "ఆ సమయానికి నేనే కనుక అక్కడ లేకపోతే ఆవిడ కనీసం కుర్చీలోనుంచి కూడా లేచి ఉండేది కాదు ఇలాంటివే మరో రెండు మూడు సంఘటనలు జరిగితే ఆవిడలో ఉన్న బద్ధకం కాస్తా పూర్తిగా వదిలిపోతుంది" అంది

అక్కయ్య సాహసంచూసి నాకుమాత్రం ఒకే భయంగా ఉండేది అక్కయ్యకు చెప్పిచూశాను— "ఎందుకు వచ్చిన గొడవ చెప్పు సరోజా! భార్యాభర్తల మధ్య ఎన్నో ఉండొచ్చు నీ విలా జోక్యం కలిగించుకోడంవల్ల ఆమె మంచిదార్లో పడుతోందో, నీపీడ కష్ట గడుతోందో ఏం తెలుస్తుంది?" అని

"అంత పిరికితనం ఏమిటే నీకు? ఆవిడ దార్లో పడుతోందని తెలుస్తూనే ఉందిగా! ఇంకొక్క వారం రోజుల్లో చూడు ఎంతలా మారిపోతుందో!" ధైర్యంగా సమాధానమిచ్చింది అక్కయ్య!

మరోనాడు సాయంత్రం పుస్తకం చదువుకుంటూ మేడమీద గదిలో కూర్చున్నాను అక్కయ్య గదిలోకి వస్తూనే చాలా హుషారుగా కనుపించింది.

"ఏమిటే ఆ జోరు?" అన్నాను

"మరో దిగ్విజయమైన ప్రయత్నం" అంది నవ్వుతూ!

"ఏం? ఏమయిందేమిటి?" నా ప్రశ్న

"కాలేజీనుండి ఒంటరిగా నడుస్తూ వస్తున్నాను వెనకాల స్కూటర్ వస్తున్న శబ్దమయేసరికి వెనుదిరిగి చూశాను మేష్టారే! వెంటనే ఓ ఐడియా తట్టింది మేష్టార్ని ఆగమంటూ చెయ్యి చాచాను స్కూటర్ ఆగింది 'అర్జంటుగా ఇల్లు చేరకోవాలి! ఎక్కడా ఓ టాక్సీ కూడా కనుపించడంలేదు కొంచెం లిఫ్టు ఇస్తారా?' అంటూ ఆతురత వ్యక్తపరచాను ఓ సావు నిముషం ఆలోచించి, చిన్నగా నవ్వుతూ వెనకాల కూర్చోమన్నారు మేష్టారు మనింటి దగ్గర దిగడం బాగుండదంటూ వాళ్ళింటిముందే స్కూటర్ని ఆపమన్నాను. సమయానికి సుశీలమ్మగారు వీధిమైపే ఉంది మేమిద్దరం స్కూటర్ దిగడం చూచింది కూడాను దీనితోనైనా ఆవిడ కొంచెం జాగ్రత్తగా మసులుకుందుకు ప్రయత్నించాలి! చూస్తూండు మరో కొద్ది రోజుల్లో ఆ స్కూటర్మీద వాళ్ళిద్దర్నీ కలిసి చూడొచ్చు!"

తను చేసిన పని ఏదో ఘనకార్యంగా అక్కయ్య చెప్పినా, నా కెందుకో భయం వేసింది అక్కయ్యకి అంత సాహసం పనికిరాదేమో అనుకున్నాను మరోవైపు అక్కయ్యమీద అనుమానం కూడా కలుగుతో ఉండేది— 'ఆయన్ని నిజంగా ప్రేమిస్తోందేమో' అనుకునేదాన్ని 'అక్కయ్య వయసలాంటిది! అదే ఇంత పని చేస్తోంది!' అనిపించేది ఒక్కొక్కసారి ఈ కథ చదువుతూంటే అక్కయ్యమీద మీకు కూడా ఏదో విధమైన అభిప్రాయం ఏర్పడే ఉంటుంది. అలాటి అభిప్రాయం ఏర్పరచుకునేముందు ఈ క్రింది విషయాన్ని మాత్రం చదవవలసి ఉంటుంది.

అక్కయ్యా నేనూ ఒకే గదిలో పడుకునే వాళ్ళం మా ఇద్దరి పుస్తకాలూ ఎప్పుడూ కలిసిపోయే ఉండేవి ఒకనాడు అక్కయ్య గదిలో లేని సమయంలో నే నంతకుముందెప్పుడూ చూడని ఎక్సర్‌సైజు పుస్తకం ఒకటి నా కళ్ళబడింది వింతగా దానిలో పేజీలు తిప్పాను అది పూర్తిగా చదవడానికి ఓ పది నిముషాలు కూడా పట్టలేదు కాని, చదువుతున్న పది నిముషాలూ నన్ను నేనే మరచిపోయాను చదవడం పూర్తయాక నాకు తెలియకుండానే నా కళ్ళమ్మట నీళ్ళు రాలాయి! ఆ పుస్తకం అక్కయ్య రాసుకుంది. తాను పూనుకొన్న కార్యం చాలా కష్ట సాధ్యమనీ, ఆకార్య నిర్వహణలో తనేమైనా తప్పటడుగులు వేయవచ్చుననీ తనకు తానే హెచ్చరించుకుంది మొదటి రెండు పేజీల్లోనూ, ఆలోచనా నిమగ్నులైన సుందరమూర్తిగార్ని ఎక్కడెక్కడ ఎలా చూసిందో వ్రాసుకుంది. తరువాత, ఆయన ఒలా ఉండడం తన మనసులో ఎంత జాలి కలిగించిందో రాసుకుంది ఇంకో పేజీలో తను ఆయన విషయంలో జోక్యం కలిగించుకుందామని నిర్ణయించుకునేముందు తన మనసులో కల్గిన ఆవేదన వర్ణించుకుంది మరో పేజీలో తన కర్తవ్య మేమిటో, దాన్ని ఎలా నిర్వహించాలో రాసుకుంటూ, తను తప్పు దార్లో పడకుండా ఉండడానికి తనను తనే హెచ్చరించుకుంది ఆ పుస్తకం విషయం మీకు పూర్తిగా చెప్పలేను మీరే నా దగ్గరఉంటే ఆ పుస్తకాన్ని మీ చేతుల్లోనే ఉంచుదును

అక్కయ్య తనతో క్షమాపణకన్నా క్షమాణకి నా మనసులో ఆ రోజున ఎన్నో క్షమాపణలు కోరుకున్నాను

ఆ పుస్తకం పూర్తిగా చదివాక తెలుసుకో గలిగాను అక్కయ్య వేసిన ప్లాను ఎంత విలువైనదని సుశీలమ్మగారు తన కార్యక్రమాలతో ఎంత నిర్వికారంగా మసిలినా, ఆవిడ కూడా ఒక ఆడదే భర్త యందు ఎంత అలక్ష్యంగా ఉన్నా మరో స్త్రీయందు ఆయన ఆసక్తి చూపడాన్ని ఆవిడ కూడా సహించలేదు! ఒలాంటి 'అసహనం' ఆవిడలో కలిగినప్పుడు భర్త చెలిమిని కాపాడుకోడానికి ఆమె ఏదైనా త్యాగం చెయ్యడానికి సిద్ధపడుతుంది దానివల్ల ఆయన ఒంటరిగా గడిపేందుకు అవకాశం ఉండదు. అంతే! అక్కయ్య అనుకున్న కథకం అమలు జరుగుతుంది!

* * *

రెండు మూడు రోజులు గడిచాయి. అవకాశం దొరికినప్పుడల్లా సుశీలమ్మగారిలో ఆ 'అసహనం' కలిగించడానికి అక్కయ్య ప్రయత్నిస్తూనే ఉంది

ఒకనాడు సాయంత్రం నే నింటికి వచ్చేసరికి ఆరు గంటలయింది అక్కయ్య అప్పుడే ట్యూషన్‌కి వెళ్ళిందని అమ్మ చెప్పింది. 'ఇప్పుడు ట్యూషనేమిటి ఏళ్ళి కానివేళ?' అనుకున్నాను. తిరిగి అక్కయ్య వచ్చేసరికి ఏడున్నరయింది అక్కయ్య ముఖం చూస్తూనే అనుకున్నాను ఏదో విశేషం ఉందని

పరీక్ష పాసయినంత సంతోషంతో చెప్పింది అక్కయ్య—

"ఇవాళ సాయంత్రం అరున్నరకల్లా ఆవిడ

వస్తారా డ్రాప్ చేసి వెళతాను!

క్షమించండి! మా నాన్నా - అమ్మకీ నేనొక్కతే కూతుర్ని!

Jayadev

# యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు

యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు . చురుకైన ఆటగాళ్లు, విద్యార్థులు . చాలామంది స్నేహితులు గల విలాసవంతులు మంచి భవిష్యత్తును ఆశించే యశస్కాములు. ఒక్కమాటలో చెప్పాలంటే మీవంటి యువకులు . . ఫిలిప్సే ఎందుకు? వాళ్ళే అంటారు మీతో. ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది. (ఇది అసలైన టెంపర్ ఉక్కుతో తయారైంది). ఎంత చెడతొక్కినా తట్టుకోడానికి వీలుగా ఉంటుంది. ఇంకా ఫిలిప్స్ అందంగా ఉంటుంది. దీని స్నిగ్ధత, గంభీరత సంస్కృతిని ప్రతిబింబిస్తాయి విశిష్ట తరమైన బైక్. మొత్తంమీద నేటి చురుకైన యువకులకు ప్రత్యేకంగా విధానింపబడినది.

మీరు

## ఫిలిప్స్‌ను

అభిలషిస్తారు

టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు, మద్రాసు-53.



ఓ ముఖ్యమైన సభకు హాజరవబోతోందని విన్నానే తెలుసుకున్నాను సరసీ! ఇంచుమించు అదే సమయానికి, ఓ పది 'రైడర్స్' తీసుకుని మేష్టారింటికివెళ్ళి ఆయనముందు పడేశాను మొదటి లెక్క ఆయన పూర్తి చేసేసరికే ఆరున్నర అయిపోయింది. ఇంట్లో వంటావిడ కూడా లేదు ఓ నాలుగు రోజులు సెలవు తీసుకుందిట! మేష్టార్ని నన్నూ ఇంట్లో వదిలేసి, ఆమె సభకెలా వెళ్తుందో చూద్దామని నా ఉద్దేశ్యం! పాపం చాలాసేపు ఆలోచించింది ఎటూ తేల్చుకోలేకపోయినట్టుంది సడెన్‌గా, తల నొప్పిగా ఉందంటూ కొంతసేపు పడుకుని ఆరూ నలభై అయిదు అవుతుండగా ఆ సభవాళ్ళకు ఫోన్ చేసేసింది తను రావడంలేదని మేష్టారికి లెక్కలపిచ్చి ఉన్న సంగతి తెలిసిందేగా ఆవిడ పడిన యాతనని ఆయన కొంచెం కూడా పట్టించుకోలేదు పది లెక్కలూ పూర్తి చేసేదాకా ఆమె తల నొప్పి విషయం కూడా మరచిపోయారు పాపం, సుశీలమ్మగారు ముఖ్యమయిన ప్రోగ్రాం పోగొట్టుకుంది ఇప్పుడేనా ఒప్పుకుంటావా? ఆవిడలో చాలా మార్పు వచ్చిందని?"

నాకు చాలా ఆశ్చర్యం వేసింది సుశీలమ్మగారు హాజరుకాని మహిళాసభ మా వూళ్ళో అంతవరకు లేదనే చెప్పాలి! ఆవిడకు ఆ విషయంలో అంత పిచ్చి! అంత ముఖ్యమయిన కార్యక్రమాన్ని ఆవిడ రద్దు చేసుకునేలా చేసిన అక్కయ్యను అభినందించకుండా ఉండలేకపోయాను

ఇక్కడ మీకో అనుమానం రావచ్చు — 'ఇంతకూ ఆ మేష్టారికి ఓ ప్రత్యేకమయిన వ్యక్తిత్వం లేదా? ఇలాంటి సంఘటనలను ఆయన ఏ దృష్టితో చూస్తున్నారు?' అని నాకూ నమంగా అదే అనుమానం వచ్చింది నిజం చెప్పాలంటే, అక్కయ్య వేసిన పథకంమీద నాకు నమ్మకం ఉన్నాగాని, నా మనసులో ఎన్నెన్నో పిచ్చి వూహలు వచ్చిపడేవి

అక్కయ్య అంత చనువుగా మసలడంచూసి, ఆయన అక్కయ్యను చులకనగా చూస్తారేమో! లేదా అక్కయ్యకు తెలియకుండానే, అక్కయ్యమీద ఏవో ఆశలు పెంచుకొని, సడెన్‌గా వోనాడు 'సరోజా నిన్ను ప్రేమిస్తున్నాను' అంటారేమో! అప్పుడు అక్కయ్య ఒప్పుకున్నా ఒప్పుకోపోయిన ముప్పువచ్చి పడుతుందేమో!

ఆ మరునాడు అక్కయ్య తెచ్చిన వార్త బట్టి, నా వూహాలు పూర్తిగా విలువలేనివి కావటం నన్ను నేనే అభినందించుకోవలసి వచ్చింది

ఆరోజు శనివారం అక్కయ్య కాలేజీనుండి ఒంటరిగా ఇంటికి వస్తోందిట వెనకాల స్కూటర్ మీద వస్తున్న మేష్టారు, అక్కయ్య దగ్గర ఆగారుట

"సాయంత్రం సుశీలకి రేడియో ప్రోగ్రాముంది ఇంట్లో ఉండదు నీతో నా వ్యవిషయం కొంచెం మాట్లాడాలి! సాయంత్రం ఆరూ ఏడు గంటలమధ్య మా ఇంటికి రావడానికి వీలవుతుందా? ప్లీజ్! నాకోసం వీలు చేసుకొనిరా!" అన్నారుట అక్కయ్య సమాధానంకోసం చూడకుండానే, స్కూటర్ స్టార్టుచేసి వెళ్ళిపోయ్యారుట

# పాఠంనేర్పిన పాఠం

'వెళ్ళకపోతే మేష్టారికి కోపం వస్తుందేమో?— వెళ్తే ఏం జరుగుతుందో?' అక్కయ్యకు ఒక వైపు భయం—మరో వైపు ఆతురత!

అక్కయ్య మనసులో ఒకే ఆవేదనగాఉన్నా, కథ క్లైమేక్సుకి వస్తోందని నా మనసులో ఒకే సంతోషం!

అక్కయ్యలోఉన్న అసలైన ఆడదానితనం ఆ రోజు బయటపడింది "నాతో చెప్పుకునే వ్యవిషయం ఆయన కేమి ఉంటుందే! కొంప తీసి నా చనువుని ఆయన చులకనగా అర్థం చేసుకోడం లేదుకదా?" అంది వోసారి

"పాపం ఆవిడ్ని ఒద పుగో పెట్టుకునే సాహసం లేదు ఆయన్లో! ఆవిడతో నానాయాతనా అనుభవిస్తూ ఉంటారు ఒదేదో వివరించుకుందామనే నన్ను రమ్మని ఉంటారు" అంది మరోసారి

సాయంత్రం ఆరు గంటలయే లోపున నే మిద్దరం అనుభవించిన సస్పెన్సు మీకు చెప్పనక్కరలేదనుకుంటాను నా సంగతి ఎలా ఉన్నా అక్కయ్య విషయం ఆలోచించండి! నాకు ఒక్క నిముషం కూడా తీరిక లేకుండా తన ఆలోచనల్ని చెప్పుకుపోయేది మేష్టారిమీద వో నిముషంలో జాలి! ఆవిడకు ఎందుకు అంత లోకువయిపోవాలంటూ మరో నిముషంలో కోపం!

ఎలాగయితేనేం సాయంత్రం ఆరు గంటలు కావచ్చింది మేష్టారు ఏం చెప్తారో, ఏం చేస్తారో అని మా ఇద్దరికీ ఒకే తొందర! ఎందుకైనా మంచిదని, ఆ గంటసేపూ నేను ఎక్కడికీ వెళ్ళకుండా నా రూమ్‌లోనే ఉంటానని ఒప్పుకున్నాను అక్కయ్యను పుస్తకాలు తీసుకుని మరీ వెళ్ళమన్నాను అక్కయ్య మెల్లిగా మేష్టారింటికి వెళ్ళింది

ప్రతి అయిదు నిముషాలకీ నేనా ఇంటివైపు చూస్తూనే ఉన్నాను ఆ గంటసేపూ వో యుగంలా గడిచింది టైము ఏడుదాటి పోయింది. అక్కయ్య మాత్రం ఇంకా బయటకు రాలేదు. ఆకాశంలో మేఘాలు అలుముకున్నాయి

వీధి దీపం కాంతిలో మసగ్గా కనుపిస్తోంది మేష్టారి ఇల్లు. మరికొంచెం సేపటికి చిన్నచిన్న తుంపర్లు కూడా పడటం ప్రారంభించాయి.

నే నొకటే కంగారు పడిపోతున్నాను!

ఆ ఇంటి వైపే చూస్తూ కూర్చున్నాను!!

మరో కొంతసేపటికి ఒక టేక్సీ వాళ్ళ ఇంటి ముందు ఆగింది ఇద్దరు వ్యక్తులు ఇంట్లోకి వెళ్ళడం కనుపించింది అందులో ఒకవ్యక్తి 'సుశీలమ్మ' గారని మాత్రం తెలుసుకో గలిగాను ప్రక్కనున్న మగాయన ఎవరో ఆ మసక వెలుగులో తెలియలేదు!

మరి రెండు నిముషాల్లో అక్కయ్య ఆ ఇంటి బయటకు రావడం కనుపించింది. "హమ్మయ్య!" అంటూ ఒక్క నిట్టూర్పు విడిచాను

ఇంటికి వచ్చిన అక్కయ్య ఎన్నో విశేషాలు చెప్తుందనుకున్నాను పుస్తకాలు విసుగ్గా టేబుల్ మీద పడేసి, నీరసంగా మంచం మీద వాలింది. నేను ప్రక్కనే కూర్చున్నాను "చాలా పొరపాటు జరిగింది సరసీ! నీ కెలా చెప్పాలో అర్థం కావటం లేదు ఇప్పుడింత కంటే మరేమీ చెప్పలేను దయచేసి ఇంకేమీ అడగకు!" అంటూ ముసుగుకుంది

నా, సికంగా ఎంతో అసి పోయినట్టుంది, ఆ రాత్రంతా ఏవేవో ఊహించుకుంటే!

మరునాడు ప్రొద్దున్నే పావకాలంగా, జరిగిన సంగతంతా చెప్పింది అక్కయ్య! చెప్పడం మొదలెడుతూనే కొంచెం ఆవేశంలో మాట్లాడింది

'సంసారం' అనే పదానికి సరియైన అర్థం నేనిన్నాళ్ళూ వూహించుకోలేకపోయాను సరసీ! భార్యాభర్తల మధ్య ఉండే బంధం, నే ననుకున్నంత తేలికైనది కాదు ఈ విషయంలో నాకంటె నువ్వే బాగా ఆలోచించ గలిగావు త్యాగాలు, క్షమాపణలు, వాగ్దానాలు మొగతనో, ఉంటాయి



# పాఠం నేర్పిన పాఠం

ఆ అందం వెనుక. పెళ్లి కాక ముందు అవన్నీ తన కళ్లకి కనుపించవు ఇన్నాళ్లుగా పరిచయం ఉన్నా, మేస్టారి నిజస్వరూపం తెలుసుకోలేక పోయాను !"

"ఈ సోదంతా నా కెందుకు, దయచేసి జరిగిన సంగతి చెప్పవే !" అంటూ అక్కయ్యను అవు చేశాను.

, నాపై దయచూపింది అక్కయ్య జరిగిన సంగతి చెప్పింది

"నేను వెళ్లే సరికి మేస్టారిల్లు సైలెంట్‌గా ఉంది. సగం తెరిచి ఉన్నా పోలు తలుపుతోసి, లోపలకు చూశాను ఎవ్వరూ కనిపించలేదు మేడ పైనుండి సన్నగా వాయులీనం మీద పాట వినిపిస్తోంది. మేస్టారే అయి ఉంటారని మెల్లిగా మేడమీదకు వెళ్లాను మేడపైనున్నది మేస్టారు కాదు. ఆయన చెల్లెలు 'సులోచన' గారు ఆవిణ్ని నే నింతకు ముందు రెండు మూడు సార్లు ఆ ఇంట్లోనే చూశాను ఎక్కువ పరిచయంలేదు. ఆవిడ నా వైపు చూసేసరికి గు ఏ ు ర్తు ి మచ్చాయి అ ప్రయత్నందనే 'నమస్కారమండీ' అన్నాను పాట ఆపి, చిన్నగా నవ్వుతూ, 'రా సరోజా ! కూర్చో !' అంటూ ఆహ్వానించారు మెల్లిగా వెళ్లి ఆవిడ ఎదురుగా కూర్చున్నాను

'అన్నయ్య ఇప్పుడే అలా బయటకు వెళ్లాడు ఓ గంటలో వస్తానన్నాడు అంతవరకు మనం మాట్లాడుకుంటూ ఉందాం కూర్చో !' అంటూ లేచి వాయులీనాన్ని ప్రక్క గదిలో పెట్టేసి వచ్చారు "

అక్కయ్య పై రెండు ముక్కలూ చెప్పేదాకా గాని నా మనసు కుదుట బడలేదు మరే ప్రమాదమూ జరగలేనందుకు సంతోషించాను అక్కయ్య చెప్పిన తరువాతి విషయాలన్నీ మీకు సంక్షిప్తంగా చెప్పేస్తే ఈ కథ పూర్తయినట్టే!

ఆ ముందు రోజు రాత్రి మేస్టారింటికి ట్యూషన్‌కి వెళ్లినప్పుడు అక్కయ్య తన పుస్తకాలతోబాటు తను రాసుకున్న ఎక్సర్ సయి జ్ పుస్తకం కూడా పొరపాటుగా తీసుకు పోయింది అవతల సుశీలమ్మగారి విషయమే ఆలోచిస్తున్న తను, ఆ పుస్తకం మాట మరచి పోయి, మేస్టారి దగ్గర వదిలేసిన కొన్ని పుస్తకాల్లో ఆ పుస్తకం ఉండి పోయిందని తెలుసుకో లేక పోయింది. మరునాడు ప్రొద్దున్నే అక్కయ్య ట్యూషన్‌కి వెళ్లలేదు అంచేత ఆ సాయంత్రం వరకూ గూడా ఆ పుస్తకం మాట తనకు గుర్తు రావలేదు. అక్కయ్య పుస్తకం సుందరమూర్తి గారి కంట బడింది. విషయాలు బాగా అర్థం చేసుకున్నారు. ఆయన పాత జీవితాన్ని అక్కయ్యకు తెలియపరచడం అవసర మనుకున్నారు

ఆయన జీవితం గురించి ఆయనే చెప్పుకోడం ఇష్టంలేక, వూళ్లోనే ఉంటున్న ఆయన చెల్లెల్ని తీసుకువచ్చారు ఆ పని పూర్తి చేయడానికి

ఎలా చెప్పినది అలాగే ఈ క్రింద వ్రాస్తున్నా—

"అన్నయ్యది అదో రకమైన జీవితం సరోజా ! ప్రతి చిన్న విషయాన్నీ సీరియస్‌గా ఆలోచించడం అన్నయ్యకు అలవాటు ! తన పెళ్లి విషయంలో కూడా అన్నయ్య చాలా కోరికలు పెట్టుకున్నారు తన కాలేజీ దశలో ఇద్దరమ్మాయిలు అన్నయ్యను ప్రేమించారు. అన్నయ్య ఇద్దర్నీ నిరాకరించాడు చిన్నప్పటి నుండే అన్నయ్యకు పహోధ్యాయినిగా ఉండి, యూనివర్సిటీలో కూడా తనతో చదువుకున్న మామయ్యగారి అమ్మాయి "విమలనే వివాహమాడాలనుకున్నాడు అన్నయ్య నిర్ణయం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది ఆస్థి అంతస్థుల్లో మామయ్యగారి కుటుంబం మాకుటుంబంతో ఏ మాత్రం సరిపోదు పైగా, విమల వదిన అసలు అందంగా ఉండదు చిన్నప్పుడు జరిగిన ప్రమాదం వల్ల ఎడమచేతి రెండు వేళ్లు ఉండేవి కావు. అందుకని అన్నయ్య నిర్ణయాన్ని నాన్నగారు ఏ మాత్రమూ అనుమతించలేదు ఇంకో విషయం చెప్పడం మరిచాను అన్నేళ్లుగా ఇద్దరూ కలిపి చదువుకున్నా, ఆ ఇద్దరి మధ్యా ఏ ప్రేమ విషయాలు రాలేదు. అందుకనే అన్నయ్య చేసుకున్న నిర్ణయం విమలకు కూడా కొంచెం ఆశ్చర్యం కలిగించింది విమల వదిన చాలా తెలివైన పిల్ల ! అందచందాల్లో తను అన్నయ్యకు ఏ మాత్రమూ సరిపోదని తెలుసుకుంది

అన్నయ్య తన నిర్ణయాన్ని తెలియపరుస్తూ 'మన చదువు ఎలాగా పూర్తయిపోయింది ఎక్కడున్నా మన బ్రతుకు మనం బ్రతక గలం ఎవరికీ చెప్పకుండా పోదాం పద !' అన్నాడుట

పెద్ద మనిషి : ఏమే ! గొల్ల ! రోజు రోజుకి పాలు చాలా పలచగా వున్నాయి.

గొల్ల : నాకేటి సెయ్యమంటారు బాబు. గేదె ఎక్కువ నీళ్లు తాగేస్తున్నది.

సాంబమూర్తి (సోంపేట)

అందుకు సమాధానంగా, 'వద్దు బావా, వద్దు! పెద్దలకు ఎదురు తిరిగి, నలుగురి చేతా అసహ్యించుకోబడి మనం సాధించేదేముంది ? ఎంతో అదృష్టవంతుడివి ! బాగా డబ్బున్న కుటుంబంలో పుట్టావు! దేనికీ లోటులేదు మనిద్దరం ఎక్కడికైనాపోతే, అందరూ ఎన్నెంతలా ఆడిపోసుకుంటారో వూహించలేవా ? 'ఆ కురూపి మా వాణ్ణి వంచించేసింది' అంటారు అలాంటి అపవాదులన్నీ నే భరించలేను బావా ! నీతో జీవితం గడిపే అదృష్టానికి నేను నోచుకొన్నట్లయితే, ఆస్థి అంతస్థుల్లో కాకపోయినా, కనీసం అందంలో నైనా నీతో సమంగా ఉండగలిగేదాన్ని ! ఈ యవ్వనంలో, నా లోని ఈ లోపం నీకంత లెక్కగా కనుపించక పోవచ్చు ! కొన్నాళ్ల తరువాత రోజులెలాగుంటాయో ! నన్ను క్షమించు బావ ! నీ నిర్ణయం మార్చుకో ! మావయ్య మాట కాదనకు ! అంటూ బ్రతిమాలిందట ఆమె నిర్ణయాన్ని మార్చలేకపోయా డన్నయ్య ! జీవితంలో పెద్ద దెబ్బ తిన్నట్లయింది తన వివాహం విషయం తానేమీ నిర్ణయించ దలుచుకోలేదు ఆస్థి పాస్థుల్లోనూ, అంద చందాల్లోనూ, అన్నయ్యకు సరితూగే ఒక సంబంధం కుదిర్చారు. 'సుశీల'తో అన్నయ్య పెళ్లయిపోయింది.

ఆ మరుక్షణం వాళ్లిద్దరి మధ్యా ఎంతో అగాధం కనుపించేది. వదిన— కలవారి బిడ్డ ! ప్రతి విషయంలోనూ, తను అంతవాళ్ల అమ్మాయినేన అహంభావం ! మెట్రిక్ పరీక్షకు కట్టిందన్నారు పెళ్లి జరగబోయే ముందు ! డబ్బున్న వాళ్ల చదువే చదివానను! ఎదుటి వ్యక్తి విలువను కూడా తెలుసుకోలేని అజ్ఞానం. ఆధునిక నాగరికతయందు చెప్పలేని వ్యామోహం ! పది రోజులు తిరగకుండానే అన్నయ్యకు మొహం మొత్తేసింది ఆమెతో స్నేహం!

పెళ్లయిన పది రోజులకే అన్నయ్యకు ఈ వూళ్లో ఉద్యోగ మయింది ఆ యేడే నేను బి ఎస్ సి పూర్తి చేసి ఇంట్లో ఖాళీగా ఉన్నాను. తోడుగా ఉండడానికని, వాళ్లిద్దరితో పాటు, నన్ను కూడా ఈ వూరు పంపించారు రోజులు వెళ్తున్నా అన్నయ్య సంసారంలో ఏదో పెద్దలోపం కనుపించేది ప్రతి చిన్న విషయానికీ వదిన మీద మండిపడేవాడన్నయ్య ! వాళ్లిద్దరి మధ్యా మసలడం ఎంతో సిగ్గుగా ఉండేది నాకు !

మేమీ వూరు వచ్చిన నెల్లాళ్లకి విమల వదిన మా ఇంటికి వచ్చింది బరోడా, స్త్రీల కళాశాలలో తనకు ఉద్యోగం వచ్చిందట వెళ్లే ముందు అన్నయ్యను చూసి వెళ్దామని ఈ వూరు వచ్చింది. రెండు రోజులు మాతో గడిపిందో లేదో విషయాలన్నీ బాగా అర్థం చేసుకుంది తనకు ఉద్యోగం దొరికిన సంతోషంతో అన్నయ్య కొక రికార్డ్ ప్లేయరునీ, వేళాకోళంగా ఓ కీ బొమ్మనీ కానుకగా ఇచ్చింది

రైలెక్కుతూ అన్నయ్య చేతిలో ఓ ఉత్తరం మాత్రం ఉంచింది

అందులో ఇలా రాసి ఉంది— 'చాలా అదృష్టవంతుడివి బావా నువ్వు ! జీవితంలో ఏవేవో సాధించాలని పెద్దగా వూహించుకునే వాడివిగా ! సాధించడానికొక చక్కని మార్గం చూపించాడు భగవంతుడు నన్ను వివాహమాడితే నీ జీవితం ఎలాగో ఉండునని వూహించుకుంటూ, నీ సంసారాన్ని నీవే పాడు చేసుకుంటున్నావు ఆమెను అసహ్యించుకోడమే నేర్చుకున్నావు గాని, ప్రేమించడం అసలు నేర్చుకోలేదు నువ్వు ! ఎన్నాళ్లని రోజులిలా వెళ్లనిస్తావు ? నీవు సాధించలేని దేదీ లేదు ఆమెకు బాగా చదువు చెప్పుకో ! 'సుశీల' కూడా ఆడదే బావా ! ఆమెకూ అభిమానం ఉంది నీవు ఆమెను అసహ్యించుకుంటే ఆమె నిన్ను అసహ్యించుకుంటుంది ఆమెపై నీవు కక్ష పెట్టుకుంటే, ఆమె నీపై అదే పెంచుకుంటుంది దీనివలన మీరిద్దరూ సాధించేదేమీలేదు ! బాగా చదువుకున్నవాడివి నువ్వు ! మిడిమిడి జ్ఞానంతో ఏమీ తెలియని అబల ఆమె ! ఆమెకనుగుణంగా నీ కోరికలు మార్చుకునే శక్తి నీలో ఉంది అదే శక్తి ఆమెలో లేదు ! జీవితంలో సుఖం చూడడానికి ఈ మాత్రం త్యాగం చేయవలసి ఉంటుంది నువ్వు ! కోపం అంటే ఎరగనివాడివి ఇలా మారిపోయా వెందుకు బావా ! దేన్నైనా సాధించడానికి ఓర్పు కావాలి! తెలివి నుపయోగించి నీ సంసారాన్ని సరిదిద్దుకో ! తిరిగి రెండేళ్ల తర్వాత మీ ఇంటికి వస్తాను అప్పటి సుశీల ఇప్పటి సుశీలకంటె వేయిరెట్లు మెరుగుగా కనుపించాలి ! ఆమె ఆనందం కోసం నీ జీవితం వెచ్చించడం కూడా ఒక పెద్ద ఆదర్శమే నని నీకు అనిపించడం

లేదా ! వివాహాన్ని వారు కుదిర్చడమే, నీవు నా కిచ్చే శుభాశీస్సులని తలుస్తూ,

శుభాకాంక్షలతో, నీ 'విమల'

ఆమె ఉత్తరం అన్నయ్యలో చాలా మార్పు తెప్పించింది ! మెల్లిమెల్లిగా తనను తానే సరిదిద్దుకున్నాడన్నయ్య ! వదిన మీద ప్రత్యేక మైన శ్రద్ధ తీసుకొన్నాడు బుజ్జగిస్తూ పాఠాలు చెప్పేవాడు ఆమె కావాలనుకున్నవన్నీ జరిపించేవాడు ఒకొక్కప్పుడు వదిన అన్నయ్య ఓర్పును పరీక్షించేది తట్టుకున్నాడన్నయ్య ! ఆరు నెలలు తిరక్కుండానే వదినలో చాలా మార్పు కనుపించింది అన్నయ్య తన పనుల్లో ఆమె సహాయం అర్థించేవాడు తనకూడా గానసభలకు గానకచేరీలకు తీసుకు వెళ్ళేవాడు వీలయినప్పుడల్లా వదినను కాలేజీకి రమ్మనేవాడు నా సహాయం కూడా తీసుకొని, మెట్రిక్ పరీక్ష, కొన్ని హిందీ పరీక్షలు పూర్తి చేయించాడు

తరువాత సంవత్సరంలోనే నాకు అన్నయ్య స్నేహితుడు లోకాయనతో వివాహం జరిగింది, నేను కూడా ఈ వూరు కాపురం వచ్చేశాను మరచిపోయిన సంగీతం అంతా సాధకం చేసుకుంది వదిన మరో ఏడాది తిరగకుండానే, 'మహిళా మండలి'లో ఓ ప్రత్యేక స్థానం ఏర్పరచుకో గలిగింది 'వదిన చదవని పుస్తకాలు లేవు, హాజరవని సభలు లేవు' అనేంత నిర్విరామంగా తయారయింది వదిన పుట్టుకతోనే కలవారి పిల్ల అవడం వల్ల, ఉన్నత స్థాయి మనుషుల మధ్య సక్రమంగా ప్రవర్తించడం కష్టం లేకుండానే నేర్చుకో గలిగింది

వదినలో అంత మార్పు వచ్చినందుకు అన్నయ్య సంతోషించాడు అయినా వదిన యందు నిజమైన ప్రేమ పెంచుకోలేపోయాడు తను ఎంత సరిపుచ్చుకున్నా, తనమనస్తత్వానికీ, వదిన మనస్తత్వానికీ అప్పుడప్పుడు తేడా కనుపిస్తూనే ఉండేది రెండేళ్ల తర్వాత విమల వచ్చేసరికి, వదినలో మార్పు కన్పించాలని ఓ పట్టుదలతోనే అంతవరకు వదినమీద శ్రద్ధ తీసుకున్నాడని చెప్పాలి! అన్నయ్యను మెప్పించే శక్తి తనలో లేకపోయిందని వదిన కూడా అప్పుడప్పుడూ బాధ పడుతూ ఉండేది

ఎలాగయితేనేం, రెండేళ్లు గడిచాయి విమల బరోడా నుండి నేరుగా ఈ వూరు వచ్చి, ఇక్కడి నుండి వాళ్ల వూరు వెళ్తున్నట్టు ఉత్తరం వ్రాసింది రిసీవ్ చేసుకుందామని నలుగురం స్టేషనుకు వెళ్లాం బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో విమల రాలేదు తరువాత తెలిసింది బరోడాలోనే ఏదో టాక్సీ ప్రమాదంలో చిక్కుకుని ప్రాణాలు కోల్పోయిందని

అన్నయ్య మనసు పాడయింది ఆ విచారంలో, అనవసరంగా వదినను రెండు మూడుసార్లు తిట్టాడు తనకు ఈ పెళ్లి జరగక పోతే, విమలకు ఈ ప్రమాదం జరిగేది కాదన్నాడు నాలుగైదు రోజులు వదినంటే చిరాకుగా ప్రవర్తించాడు విమల రాసిన ఉత్తరం వదినపై విసిరి కొట్టాడు ఓ సందర్భంలో ! వదిన అర్థం చేసుకో గలిగింది తను విమలకు సరి తూగలేదని అన్నయ్య ప్రవర్తన చూసి బెంగ పెట్టుకుంది అన్నయ్యను ఆకర్షించలేని తన జీవితం వ్యర్థమనుకొని, ఆ విషయాన్ని అన్నయ్యకు ఓ ఉత్తరంలో వ్రాసిపెట్టి ఆత్మహత్య చేసుకుందుకు ప్రయత్నించింది. విషయం 'చెప్పకుండానే' ఆ ఉత్తరం నా కంట బడింది. అన్నయ్యకు చూపించి మందలించాను విమల రాసిన ఉత్తరం యొక్క లక్ష్యాన్నే తను మరచిపోతున్నాడని అన్నయ్యకు జ్ఞాపకం చేశాను వదిన ఉత్తరాన్ని చూసుకుని సిగ్గుపడిపోయాడన్నయ్య అది అన్నయ్య జీవితంలో మూడవ పరిణామం ఆ నాటి నుండే అన్నయ్య జీవిత లక్ష్యం ఒక్కటే— వదినను ఎప్పుడూ సంతోషంగా ఉంచడం !

ఈ విధంగా అన్నయ్య సంసారం ఎన్నో ఒడిదుడుకుల ననుభవించింది ఇప్పుడు వాళ్లిద్దరి మధ్యా ఏ గోడలూ అడ్డంలేవు ఇద్దర్లో ఎవళ్లెలా ప్రవర్తించినా ఒకళ్ల నొకళ్లు అనుమానించుకోరు

విమలను మాత్రం అన్నయ్య మరవలేదు ఆమె గుర్తుకు వచ్చినప్పుడు అదేపనిగా ఏవేవో ఆలోచిస్తాడు కాలేజీలో ఉన్నప్పుడు విశ్రాంతి సమయాల్లో ఆ కీబొమ్మతో ఆడుకుంటాడు— ఈ రెండూ అన్నయ్యకు, హాబీలుగా తయారయ్యాయి వదిన వీటికి అలవాటు పడింది అన్నయ్యకు మరో హాబీ ఉంది అది ఈ మధ్యనే ప్రారంభించాడు — ఎవళ్లెలాంటి సహాయం అడిగినా కాదనకుండా చేయడం !

అన్నయ్యలో ఏదో ప్రత్యేకత ఉందని నీవు తెలుసుకున్నావు సంతోషమే కాని ఇవేమీ తెలియక, పాపం, పది రోజుల నుండి శ్రమపడ్డావు ఇప్పటికైనా ఆ పుస్తకం అన్నయ్య కంట బడడం నయమే అయ్యింది జరిగిందానికి మనసు పాడు చేసుకోకు చిన్న పిల్లవు ఈ విషయాన్ని తేలిగ్గా తీసుకో ! నీ నీ ప్రయత్నంలో ఉన్నట్లు వదినకు ఇప్పటికీ తెలియదు కాని, ఈ మధ్య నీ ప్రవర్తనలో క్రొత్తదనం వదినకు మాత్రం కనుపించి, ఆ విషయం అన్నయ్యతో అందిట అయినా, ఆ విషయాల్ని నీ వనుకున్నంతగా వదిన కూడా లెక్క చేయలేదు ఎదోలాగో పెళ్లి చేసుకున్నాక నీకే అర్థమవుతుంది !"

అదంతా విన్న అక్కయ్య సిగ్గుపడిపోయిందట వీధిలో టాక్సీ ఆగిన శబ్దమయేసరికి, ఇద్దరూ వీధి వైపు చూశారుట సుందరమూర్తి గారు, సుశీలమ్మగారు కలిసి వస్తున్నారుట అక్కయ్య మనసు కొంచెం తేలిక పరచడానికి, ఆయనే స్వయంగా ఆవిణ్ని తీసుకువస్తున్నారని సులోచన గారు అక్కయ్యతో అన్నారుట ఇక అక్కడ ఒక్క క్షణం కూడా ఉండడానికి మనస్కరించక, తప్పించుకొని అక్కయ్య వచ్చేసిందిట !

ఇదీ అక్కయ్య కథ ! ఇప్పుడక్కయ్య ఓ ముద్దుల బిడ్డకి తల్లి ! ఆ రోజుల్ని జ్ఞాపకం తెచ్చుకుంటూ అప్పుడప్పుడు తమాషాగా ఉత్తరాలు రాస్తూంటుంది ఈ కథంతా మీకు చెప్పడానికి అనుమతి ఇచ్చిందంటే, తనకూ బావకూ మధ్య ఎంత సన్నిహిత సంబంధం ఏర్పడిందో మీరే ఆలోచించుకోగలరు ! మీలో ఎవరికోసం ముఖ్యంగా ఈ కథ వ్రాశానో, వారికి మరొక చిన్న మాట ఇప్పుడు నాకు అక్కయ్య ఇచ్చే సలహా అల్లా ఒక్కటే— 'చప్పున పెళ్లిచేసుకుని సంసారంలో ఉన్న తమాషాను అనుభవించవే !' అని. ★

# వేల్పుల కైనా మార్పులు తప్పవు! 2

# శివుడు

మహేష్



హైందవ దేవతాగణంలోని పురుష దేవతల్లో శివుడే ప్రాచీనతముడు. ఆర్యుల భారత వర్షాగమన సిద్ధాంతాన్ని అంగీకరించినట్లయితే, ఆర్యులు ఇక్కడకు వచ్చేరని చెప్పబడుతున్న కాలానికి ముందు నుంచీ కూడా శివుడు ఈ దేశస్థులచేత పూజింపబడుచున్నాడు. ద్రావిడ భాషలో 'చివ' శబ్దానికి (శ, చవర్ణములకు అభేదం) ఎరుపు అనీ, 'చంబు' శబ్దానికి రాగి అనీ అర్థం. దీని పోలిక ఋగ్వేదంలో ప్రయోగింపబడిన నీలలోహిత శబ్దంలో కన్పడుతుంది. శివునిరంగు ఎరుపు అని ఆ కాలంలో వూహించబడింది.

సింధునీర నగరావశేషాల్లో మూడు ముఖాలు కలిగిన పురుష దేవతా విగ్రహం కల ముద్రలు దొరికేయి. ఈ దేవత పద్మాసనస్థుడై యుండగా, పులి, ఏనుగు, దున్నపోతు, మొదలైన జంతువులు అతనిని పరివేష్టించి ఉన్నట్లు చిత్రించబడింది. దీనిబట్టి ఆకాలంలోనే పశుపతిత్వం, యోగీశ్వరత్వం కలిగిన దేవత పూజింపబడుచున్నట్లు తెలుస్తుంది. తరువాత ఆర్యులు తమ దేవతాగణంలోని రుద్రునకే ఈ లక్షణాలు ఉన్నట్లు భావించేరు. వేదాల్లో మొట్టమొదట లోకభీకరుడుగా భావింపబడిన రుద్రుడే తరువాత పశుపతిగా యోగీశ్వరునిగా, భక్తవశంకరుడైన శివునిగా పూజింపబడుచున్నాడు. మొత్తంమీద నేటి శివుడు ఆర్యానార్య భావ సంయోగ సంజనితుడని చెప్పవచ్చును.

కాలక్రమంలో త్రిమూర్తుల్లో ఒకడుగా, అగ్రదేవతా ప్రతిపత్తిని పొందిన రుద్రుడు కాకవేరే కొంతమంది రుద్రులు ఉన్నట్లు కూడా చెప్పబడింది. వీరు కేవలం దుష్టశక్తులు. వీరే తరువాత రుద్రగణంగా వ్యవహరింపబడినారు. అజైకపాత్, అహిర్బుధ్న్య, విరూపాక్ష, సురేశ్వర, జయంత, బహురూప, త్ర్యంబక, అపరాజిత, వైవస్వత, సావిత్ర, హర అనే పేర్లుగల ఏకాదశ రుద్రులు ఉన్నట్లు కూడ కొన్నిచోట్ల వర్ణింపబడింది.

## వేదాలు

వైదిక దేవతాగణంలో రుద్రుడు అంత ప్రాముఖ్యతను వహించలేదు. ఋగ్వేదంలోని రుద్రుడు పింగళవర్ణుడు, జటాధారి, స్వర్ణాలంకారుడు, కార్ముకపాణి, వజ్రబాహువు, స్వర్ణాభరణధారి, జగత్పిత, సమస్త ప్రాణికోటి కార్యకలాప జ్ఞానము కలవాడు, బలవంతులలోకెల్ల బలవంతుడు. తుఫానులను కల్పించు మారుద్గణముల తండ్రిగా వర్ణింపబడుచున్నాడు. అప్రతిహతమైన విధ్వంసక శక్తి కలిగిన పిడుగు, తుఫాను వంటి ప్రకృతి శక్తులే రుద్రుని గురించి చేసిన వర్ణనలకు కారణమై ఉండవచ్చును. కొన్నిచోట్ల రుద్రుడు వృషభముగా కూడ వర్ణింపబడుచున్నాడు. విశేషించి రుద్రుడు వైద్యులలోకెల్ల వైద్య శ్రేష్ఠునిగా కొనియాడబడుచున్నాడు. రోగములతోపాటు దోషములను హరించు శక్తి కూడ ఇతనికి ఉండుటచే, సోము, అశ్వినులవలె కేవలం వైద్యులవలె కాకుండా వైద్యశ్రేష్ఠునిగా కీర్తింపబడుచున్నాడు. ఉష్ణదేశాల్లో తుఫాను, భూమిమీదిగల కల్మషములను హరించుటయే, రుద్రుని దోషనాశకునిగా కీర్తించుటకు కారణమై ఉండవచ్చును. జలము, పర్వతాగత వాయువు సర్వరోగ నివారకము లని ఆధునిక వైద్యులు కూడ అంగీకరించుచున్నారు. అందుచేతనే పర్వతవాసియు, వర్షాధిదేవతయు (ఇంద్రుడు కూడ వర్షాధి దేవతయే) అయిన రుద్రుడు వైద్య శ్రేష్ఠునిగా గుర్తింపబడుటకు కారణము అయిఉండవచ్చును. గ్రీకు దేవతల్లో కూడ అపోలో రోగకారకుడు, రోగ నివారకుడు అయిఉండుట గమనార్హం.

సాధారణంగా రుద్రుని గురించి చేసిన ప్రార్థనలన్నీ, తమను, తమ శిశువులను, పశువులను హింసించవలదని ఉండడంవలన, ఇతని ఎడల ఆ కాలంలో భక్తికంటే భయం అధికంగా ఉండడమే కారణమై ఉండవచ్చును. విధ్వంసమే కర్తవ్యముగా కలవాడైనా, ఇతడు శివుడు, ఉదారుడు, ప్రార్థనాసులభుడు. తరువాత కేవలం ఆగ్రహ నివారణార్థమే కాక, అనుగ్రహం నిమిత్తం కూడ స్తోత్రము చేయబడినాడు.

యజుర్వేదంలో రుద్రుడు గిరిశంత అధివక్త మొదలైన పేర్లలో వర్ణింపబడినాడు. అథర్వణవేదంలో రుద్రునకు అనేక నామధేయాలు ఉన్నాయి. రుద్రుడు ఉషస్సు కుమారుడై జన్మించగా, అతనిని రుద్ర, శర్వ, ఉగ్ర, భవ, పశుపతి, మహాదేవ, ఈశాన, అశని, అనే ఎనిమిది పేర్లతో ప్రజాపతి పిలిచినట్లు శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. పశురోగ నివారణ కొరకు రుద్రుని శాంతింపజేయుటానికి, ఎద్దును బలియిచ్చే శూలగవం అనే హోమంచేసే విధానం ఆశ్వలాయన గృహసూత్రాల్లో చెప్పబడింది. నాలుగు దారుల కూడలిని సమీపించినప్పుడు, నదిని దాటేటప్పుడు రుద్రుని ఆరాధించవలసిన విధానము హిరణ్యకేశి గృహ్యసూత్రాలు మొదలైనవాటిలో వివరించబడింది.

శివుని త్రైకాలికా బాధ్యత్వమును, సర్వదేవతా స్వరూపమును, సర్వ వ్యాపకత్వమును, సర్వాధారత్వమును వర్ణించి, శివుని ప్రాప్తికొరకు పాశుపతవ్రతమును అనుష్ఠించవలసినదిగా అథర్వశిరోపనిషత్తు చెప్పుచున్నది. మహాపాతకోపపాతక నివారణ కొరకు శివవ్రతాంగమైన భస్మత్రిపుండ్రధారణను గురించి కాలాగ్ని రుద్రోపనిషత్తులో చెప్పబడింది. సరు ధ్యానయోగజ్ఞాన ఫలరూపముగు ప్రణవముచే శివుడు ధ్యేయుడని అథర్వశిరోపనిషత్తు చెప్పుచున్నది. అచింత్యా వ్యక్తానంత రూపుడును, ఉమా సహాయుడును అయిన నీలకంఠుని ధ్యానించుటచేత అజ్ఞానము నుండి విముక్తి పొందవచ్చునని కైవల్యోపనిషత్తు చెప్పుచున్నది. అహంకారావిష్టుడైన జీవుడే పశువనియు, సర్వజ్ఞ పంచకృత్య సంపన్నుడును, సర్వేశ్వరుడును అయిన ఈశ్వరుడే పశుపతి అనిన్నీ చెప్పి సద్యోజాతాది మంత్రయుక్తముగా విభూతిధారణచే ఈశ్వర జ్ఞానము కలుగుచున్నదని జాబాల్యుపనిషత్ చెప్పుచున్నది. పరమ రహస్యమగు శివతత్వమును తెలిపికొన

# వేల్పులకు మార్పులు...

గోరిన శౌనకాదిఋషులకు మార్కండేయుడు, దక్షిణా ముఖుడును, చంద్రఖండ ప్రతిఫలిత జటాక్షీర గౌరుడును, వీణా పుస్తకపాణియు అయిన దక్షిణా మూర్తి మహాత్మ్యమును తెలిపినట్లు దక్షిణామూర్త్యుపనిషత్తు చెప్పుచున్నది. సద్యోజాత, అఘోర, వామదేవ, తత్పురుష, ఈశాన తత్త్వముల వివరమును పంచాక్షరీ తత్వమును, పంచబ్రహ్మోపనిషత్తు యందు వర్ణింపబడినది భస్మోత్పాదన ధారణా క్రమమును, రుద్రాక్ష తత్వమును బృహజ్జాబాలోపనిషత్ చెప్పుచున్నది మంత్ర మాతృకయు, మృత్యుంజయ స్వరూపిణియు, సకలలోకోద్దీపినియు సకలలోకోజ్జీవికయు అయిన అక్షమాలిక యొక్క ప్రభావము అక్షమాలికోపనిషత్తు యందు వర్ణింపబడింది భస్మ రుద్రాక్షధారణ చేతను పంచాక్షర మంత్రజపము చేతను, శివపూజ చేతను జీవులు శివ లోకమును పొందగలరని భస్మజాబాలోపనిషత్తు చెప్పుచున్నది. రుద్రాక్షలయొక్క రూపలక్షణ గ్రహణ మంత్రోపాసన క్రమాలను, వాటిని ధరించవలసిన స్థాన సంఖ్యా కాలములను గురించి రుద్రాక్షజాబాలోపనిషత్ చెప్పుచున్నది విష్ణు బ్రహ్మేంద్రాదులకంటె శివుని అధిక్యత, శరభావతారము యొక్క నృసింహ విజయము, వీరభద్ర ప్రభావము మొదలైనవి శరభోపనిషత్తు యందు చెప్పబడినవి. (సశేషం)



మొహంజదారో; హరప్పా తవ్వకాలలో దొరికిన ముద్ర మీద 'పశుపతి'

---

లతో పాసయ్యేవాడు. అతడు ఎం. బి బి యస్. పాసయ్యేసరికి మీర ఫిఫ్త్ ఫారం చదువుతూంది.

"అన్నయ్యా, ఇక్కడే డాక్టరవుతావు కదూ?" అన్నప్పుడు,

"అలాగేనమ్మా! నువ్వొక హాస్పిటలు కట్టించేయి" అని నవ్వాడు గోపాలం.

"అయితే ఇంకే పూర్తైనా వెళ్ళిపోతావా?"

"హవుస్ సర్జనుగా ఆరు నెలలు పని చేస్తాను తరువాత చూద్దాం బొంబాయిలో ఏదో ఖాళీ ఉందని రాశాడు నా ఫ్రెండు అప్లికేషన్ పడేస్తాను చూద్దాం ఏమవుతుందో"

గోపాలం దూరంగా వెళ్ళిపోతున్నాడంటే మీరకు దుఃఖం కలగటంలో ఆశ్చర్య మేమీలేదు వయసులో తనకన్నా పెద్దయినా, మీర ఆశలకు ప్రోత్సాహమిస్తూ, అనవసరంగా విరుచుకుపడే తల్లి బారినుండి ఆమెను రక్షిస్తూ ఉండేవాడు గోపాలం. దుఃఖ సమయంలో, స్నేహితుడిలా ఓదార్చేవాడు. అతడు దూరంగా వెళ్ళి పోతున్నాడంటే, ఉన్నడిని దూరం చేసుకుంటున్నట్లుగా బాధపడింది మీర.

గోపాలం, కృష్ణా రాజేంద్ర ఆస్పత్రిలో హవుస్ సర్జనుగా పని చేయసాగాడు కృష్ణయ్యగారికేమో కొడుకు దూరంగా వెళ్ళటం ఏమాత్రం ఇష్టం లేదు గోవిందు, ఎం ఏ చదువుతున్నాడు శ్రీహరి సీనియర్ బి ఎస్ సి చదువుతున్నాడు. శ్రీపాదు లోయర్ సెకెండరీలో (థర్డ్ ఫారం) రెండు మార్లు ఫెయిలయి, మీర హైస్కూలు మెట్లెక్కినా, తనింకా మిడిల్ స్కూలు వదలలేదు. కమలమ్మగారికి తమ గారాబుపట్టి శ్రీపాదు పేవ

## అపస్వరం

21 వ పేజీ తరువాయి

టమూ, మీర ఫస్ట్ క్లాసులో పాసవటమూ కంటకంగానే ఉంది

మీర లోయర్ సెకెండరీ మొదటిసారే పాసయినప్పుడు శ్రీపాదు ఫెయిలయ్యాడన్న బాధతో, మీర చదువు ఆపేయ్యాలని ఎన్నో విధాల ప్రయత్నించారు కమలమ్మగారు కాని కృష్ణయ్యగారు పడనివ్వలేదు

"ఆడవాళ్ళకు చదువెందుకూ? మీర ఇంకా చదివి ఎవర్నీ ఉద్ధరించక్కర్లేదుగాని, కాస్త ఇంటిపని పాట నేర్చుకోనివ్వండి ఏ సంబంధం చూసి పెళ్ళిచేసే మార్గం చూడండి."

"ఏదైనా సంబంధం దొరికేదాకా చదువుకోని"

"ఎంతకూ నా మాట వినరేం! ఇక దానికి కూడా ఫీజు కట్టాలా"

"ఇంతమందిని చదివిస్తున్నామా? దేవుడు ఎలాగో అలా జరిపిస్తాడులే"

"మీ కంతేలెండి. కడుపున పుట్టినబిడ్డల మీదకన్నా మీరమీదే ఎక్కువ ప్రేమ మీకు." అని కమలమ్మగారు దెప్పిపొడిచారు.

"నిజమేనే! నీ మాట ఒప్పుకుంటున్నా. తల్లి తండ్రిలేని మీరంటే నా కిష్టమే. నేను కాకపోతే ఎవరున్నారు దానికి."

కమలమ్మగారి యుక్తి పారలేదు. కాని వదలటం ఇష్టంలేక మరో సలహా సూచించారు.

"పోనీ సంబంధం చెపుతాను వింటారా?

సీతమ్మగారి అన్న, బావమరిదిలేడూ, కొంచం నల్లగా ఉన్నాడుగాని, మగాళ్ళకు రంగేమిటి, మీరను అతనికిచ్చి చేద్దాం ఏమంటారు?"

కృష్ణయ్యగారు, భార్యమాటను ఏమాత్రమూ ఆమోదించలేదు.

కమలమ్మగారు ఎన్నో విధాలుగా నచ్చచెప్పాలని నని కి మాలిన సంబంధాలను, సూచించసాగారు కాని కృష్ణయ్యగారు కచ్చితంగా చెప్పేశారు "నా కిప్పుడప్పుడే మీరకు పెళ్ళిచేసే ఆలోచన" లేదని

గోపాలం చదువు పూర్తి కాగానే, ఆడపిల్లలను కన్న తల్లి తండ్రులు ఇంటికి రాసాగారు కమలమ్మగారు వరుడి తల్లికుండే సహజమైన దర్పం చూపుతున్నారు ఆడపిల్లను కన్నవారు సంకోచం తోనూ, దైన్యంతోనూ,

"పెద్ద మనస్సుచూపి మా పిల్లను చేసుకోండి" అని వేడుకున్నప్పుడు కమలమ్మగారు చెప్పేసరిగా

"ఇపుడపుడే వాడి పెళ్ళికేం తొందర లేద్దురూ, ముందు మీర పెళ్ళి కావాలి తరువాతనే వాడి సంగతి" అనేవారు

మీర స్నేహితురాలు నర్మద తండ్రి డాక్టరు సుబ్బారావుగారు తమ కూతురిని గోపాలాని కివ్వ మన్నపుడు అంతటి శ్రీమంతులు తమ వియ్యం కోరుతున్నందుకు ఎంతో సంతోషించారు కృష్ణయ్యగారు.

ఒకరోజా కృష్ణయ్యగారు మీరచేత చలవల్ల కళకళలాడుతున్న కూరముడులమధ్య బీర్పుచెట్ల పాదులో కలుపుతీ పేస్తూ కూర్చున్నారు.

"నమస్కారం. ఏం చేస్తున్నారు?".

శేటుమధులనుండి అంతటా పరిచయమైన కంఠం

[illegible] కృష్ణయ్యగారు. ఉన్ని సూటు వేసుకొని, తలకు జరీ అంచు తువాలు చుట్టుకొని, చేతిలోని వాకింగ్‌స్టిక్ తిప్పుతూ నిలబడ్డాడు డాక్టరు సుబ్బారావుగారు.

“రండి, రండి ఏమిటి అపురూపంగా దయచేశారు?” చేతికి అంటుకున్న మట్టిని దులుపుకుంటూ ఆహ్వానించారు కృష్ణయ్యగారు.

[illegible] వెళ్తున్నా. మిమ్మల్ని కనబడితే పలకరిద్దామని, ఇలా వచ్చా” అంటూ లోపలికి వచ్చారు సుబ్బారావుగారు కళకళలాడుతున్న మొక్కలనుచూస్తూ,

“ఏమండోయ్ కూరగాయలు బాగ పండిం చేస్తున్నారు. అయితే కూరలు కొనాల్సిన బాధే లేదన్నమాట” అన్నారు.

“ఆ! అంతా మా ఆవిడ పని. తోటపనంటే మహా ఇష్టం దానికి. సాయంత్రం ఇలాంటి పనులుంటే ఇంకేం అక్కర్లేదంటుంది. అదిగో అలావున్న తోటంతా దివ్యంగా తయారుచేసింది ఇప్పుడు. వరండాలో కుర్చీ ఉంది కూర్చోండి. చేతులు కడుక్కొని వచ్చేస్తాను” అంటూ పంపు దగ్గరికి వెళ్ళారు కృష్ణయ్యగారు.

[సశేషం]

# సంపెంగలూ సన్నజాజులూ

అవసరాల రామకృష్ణారావు

### జరిగిన కథ

మంజుల వివాహకారణంగా, ఆర్థిక అవసరాల దృష్ట్యా కొడుకుని కట్నం తీసుకొని పెళ్ళి చేసుకో మంటాడు తండ్రి; మొదట నిరాకరించినా చెల్లెలి పైగల ప్రేమతో తర్వాత సరే నంటాడు. కూతురి పెళ్ళి చూడాలని కుతూహల పడ్డ తండ్రి మరో ఆర్నెల్లకి తీరని కోరికతోనే కన్ను మూస్తాడు. తర్వాత మంజుల వివాహ మవుతుంది. వాళ్ల సంసారం సుఖంగా సాగిపోతుంటుంది. ఆరేళ్లు గడిచాయి. మంజు యిాలోగా బియ్యే పట్టాతోపాటు వాలుగేళ్ల మధురిమను కూడా పొందింది. అన్నయ్య వలిహేహ్హి సంపతు లిద్దరూ ఎమ్మే చదవటానికి పూనుకుంటారు. భర్తతో కాశీవెళ్ళి, రీక్ష్తు బాగా రాశానన్న తృప్తితో తిరిగివస్తూ అన్నయ్య సంసారం ఆందోళనకరంగా ఉండటం గమనిస్తుంది మంజు.

## 5

తరువాత వేల రోజుల కమకుంటూ వదిన దగ్గిరనుంచి చిన్న ఉత్తరం వచ్చింది. 'ఏమాత్రము అవకాశమున్నను వెంటనే ఒక్కసారి రావలసింది. ఆతృతకు ఎట్టి కారణమును లేదు' ఎన్నిసార్లు చదివినా అందులో అంతకంటె అక్షరాలు లేవు. నా గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఎప్పుడూ ఆమె నన్నిలా రమ్మని రాయలేదు. నా ప్రాణం ఇక అయిదు నిమిషాలు ఆగలేదు. సమయానికి ఆయన ఇంట్లో లేరు. చిన్నారి వంట్లో ఎలా ఉందో !

'అవాళ్ళ రేపు అత్త వస్తానన్నది కదటే ?' అంది మధురిమ. ఉలిక్కి పడ్డాను. అదేమిటో ఆ మాటే జ్ఞాపకం లేదు నాకు ! ఆయనకి వరసకి అక్కయిన ఒకామె కామేశ్వరి అని మద్రాసులో ఉంది. మా పెళ్ళికి చూశాను ఆవిణ్ణి, అంతే. ఈలోగా వాళ్లను రమ్మని ఎన్నోసార్లు రాశారు ఆయన.

'చేసేది పెద్దవ్యాపారమైనా, క్షణం తీరిక లేక పోయినా యింకా మాబావ గవరయ్య నయం, ఉత్తరం రాస్తే వెంటనే జవాబేనా రాస్తాడు దీనికి ఎక్కడలేని గర్వమూను. మనలాంటి బీదవాళ్ల ఇళ్ళకి ఎందుకు వస్తుంది. ఈ పూటమీదనుంచి వెడుతూ కూడా ఒక్కపూట రాదు మనింట్లో. కొన్నాళ్ళు యిప్పుడు మనకొచ్చిన లోపమేమిటో గనక!' అనేవారు ఆయన.

'ఆవిడకేం వన్నన్నాయో ఎందుకు రాలేదో వందొకొచ్చిన వ్యాఖ్యానాలు ? ఆవిడ తమ్ముడికే పెళ్లికూతుర్ని చూసుకోవడం కోసం మద్రాసంతా ఆకివస్తుందని విన్నాను. వెంటనే రమ్మని రాయండి.'

'నేను పిలిస్తే ఇదివరకే వచ్చునేమో !'

'మరి ?'

'బాగుంది! అదికూడ నాచేత చెప్పించుకోవాలా ?'

'సరే— పెద్దభాగ్యమా ఏమిటి ?' వెంటనే ఆవిడపేర తప్పకుండ ఇక్కడ పదిరోజుల పాటు దిగివ-రి వెళ్లవలసిందని రాసి ఆయనకి చూపించాను.

'భేష్, ఇంతకన్న కావలసిందేముంది ? ఆ దెబ్బతో మా కామేశ్వరక్క వచ్చి తీరుతుంది చూడు' అన్నారు ఆయన. అలా అన్నట్టే వారం తిరక్కుండా జవాబు రానేవచ్చింది. పినతల్లితో సహా ఆవిడ వస్తున్నదట

ఇంతట్లో మా వదిన దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. నేనేం చేసేది ? వెంటనే వెళ్లి ఆప్తురాలైన వదినను ఆదుకోనా ? రాకరాక ఆయన తరఫున అతిథులు ఇంటికి వస్తూంటే ఇంట్లో ఉండకుండా వెళ్లిపోనా ? వాళ్ళు మర్నాడు రైలులో వస్తున్నారు. ఈయనేమో సమయానికి ఊళ్లో లేరు.

వదిన ఉత్తరం మళ్లీ చూసుకున్నాను. 'ఆతృతకి ఎట్టి కారణమును లేదు' నిజానికి ఆ అక్షరాలే నా కెక్కువ ఆతృత కలిగించాయి. ఏమైతేనేం ఆ నాటికి ప్రయాణం మానుదా మనుకున్నాను. కన్ను మూస్తే చాలు కలిచివేసే అన్నయ్య మొహం, కష్టపడుతున్నట్టున్న చిన్నారి మొహం కనిపించేవి.

పొద్దుటే కామేశ్వరి వాళ్ళు వస్తారేమోనని మధురిమను తీసుకుని స్టేషనుకి వెళ్లేను. వాళ్ళు రాలేదు. తరువాత పాసెంజరుంటే దానికీ చూశాం. అప్పుడూ రాలేదు. ఇక నేను ఆగలేక ఆయన పేర ఉత్తరం రాసి, తాళాలు పక్కింటి వాళ్లకిచ్చి బయలుదేరి పోయాను

వీధిలో పడక్కుర్చీలో దిగాలు పడిన మొహంతో కూచున్న అన్నయ్యను చూడగానే అశుభాన్ని ఊహిస్తూ నా గుండెలు దడదడ కొట్టుకున్నాయి. కుడి చేతి చూపుడు వేలితో గాలిలో సున్నా చుట్టేడు. నా గుండె నీరయి పోయి అక్కడే చతికిలబడి పోయాను. వదిన నన్ను కౌగిలించుకుని బావురుమంది. చిన్నారి ఆ కొల్హాపురి ఘోషమునే పోయింది. కాళ్ళూ చేతులూ సన్నబడి పోయి బల్ల ఎక్కువై పోయి లేవడానికి వీలులేక తిరగడానికి శక్తిలేక అలా గంటలు తరబడి చూస్తూ కూచునేదిట.

నేను కాశీ నుండి తిరిగి వచ్చే రోజున రైలు దగ్గిర చిన్నారి నా కళ్లకు కట్టింది. అప్పుడే అడిగాను.

'ఏంరా పిల్ల ఎదుగూ బొదుగూ లేకుండా ఇలా ఉందే ?' అని.

'కొందరు నిలువుగా ఎదుగుతారు. కొందరు అడ్డంగా ఎదుగుతారు. ఇది గుండ్రంగా ఎదుగుతోంది. అంతే !' అని నవ్వేడు. అందులో ఆర్ద్రత లేదు. స్వాభావికత లేదు. గుండెలు బద్దలయ్యే ఆ నవ్వుకి అర్థం ఇదన్న మాట !

అసలు చిన్నారికి జబ్బు అని పోల్చుకోడానికే చాలా ఆలస్యం అయిపోయిందిట. ఇప్పిస్తున్న ఇంగ్లీషు మందులు ఆపి యునానీ మందులు ఇప్పించే లోగా వ్యాధి ముదిరి పోయిందిట.

'నిజానికి మన చదువులూ సంస్కారమూ అన్నీ చాలా వెనక బడి ఉన్నాయి. కనీస వైద్య విజ్ఞానం ఇవ్వని విద్య మనల్ని ఎక్కడికి తీసి కెడుతున్నట్టు ? ఈ విధంగా ఆలోచిస్తే మంగళ చదువుకోలేదన్న విషయం కూడా నన్నెక్కువ బాధించడం లేదు. రెండో ఫారం ఇంగ్లీషు ఎస్సేలూ, నాలుగో ఐదో జామెట్రీ థీరమ్సూ కంఠతా పట్టి పాస్సైన పరీక్షలు మన జ్ఞానాన్ని ఎంతవరకు పెంచుతున్నాయి' అన్నాడు ఎప్పుడూ లేనిది నిస్పృహగా.

'నా చదువూ అలాంటిదే గద, మరి నన్నెందుకు అంతగా ప్రోత్సహించావ్ ?' ఎదురు చూడని ఈ ప్రశ్నకు అన్నయ్య తెల్లబోతాడేమో అనుకున్నాను. ఊహూ. ఒక్క నిమిషం ఆలోచించి జవాబు చెప్పేడు.

'మంగళకీ నీకూ మనస్తత్వంలో చాలా తేడా ఉంది మంజూ ! వంటలోనూ పిల్లలతోనూ ఇంకా టైం ఉంటే ఏ రామాయణంలోని పద్యాలో చదువుకుంటూ తను కాలక్షేపం చెయ్యగలదు. మన బుర్రలకి 'యాక్టివిటీ' ఎక్కువ. అలా గడపలేం. ఎప్పటి కప్పుడు ఏదో ఒకటి కల్పించు కుంటే గాని నీ బుర్ర తిన్నగా ఉండదు. అందుకని అది అస్తమానూ ఎంగేజ్ అయి ఉండడం మంచిది. దానికి నీ విషయంలో ఇంతకన్న మంచి పద్ధతి లేదు మరి !'

'అయితే బతికున్నన్నాళ్ళూ నేనిలాగ చదువు కుంటూనే ఉండాలందూ ?'

'ఏదేం ప్రశ్న ? దానికేం గాని ముఖ్యంగా ఈ డిగ్రీల వల్ల వ్యక్తిగతంగా మనం ఎంతవరకూ వికాసం చెందుతున్నామూ అని. నా మటుకు నేను సాధించేముంది ఐదేళ్లలో ముగ్గురు పిల్లల్ని కనడం తప్ప !'

మనస్ఫూర్తిగా దోషం చేసినట్టు ఒప్పుకుంటున్నట్టున్న అన్నయ్య ముఖం చూస్తే ఎలాంటి వాళ్ల కయినా వివేకోదయం అవుతుంది.

'సీత పుట్టినప్పుడు మా వదినకు జబ్బుచేసింది. మళ్లీ ఆర్నెలు తిరగలేదు, ఇది కడుపున పడింది. ఇంత దగ్గిర దగ్గిరగా పుట్టిన పిల్లలకు ఆరోగ్యం ఎలా ఉంటుంది ? పుట్టిన దగ్గర్నుంచి మిగిలిన

పిల్లల్లా వాళికి తగిన ఆరోగ్యమూ పెరుగుదలా లేవు. ఈనాడు అది ఈ విధంగా పోయిందంటే, దానికోసం తల్లి బెంగెట్టుకుందంటే పిల్లలిద్దరూ తల్లి మొహం చూసి బిక్కుబిక్కుమంటున్నారంటే ఇంట్లో ఇంత చీకటిని ప్రసరింప జేసిన నాకేమిటి శిక్ష!'

మేమిద్దరం వద్దంటున్నా వినకుండా ఆ వాళే అన్నయ్య బ్యాంకుకి వెళ్ళిపోయాడు! వదిన వీధి తలుపు వేసివస్తూ అంది.

'మొత్తానికి విచిత్రమైన మనిషి. వారం రోజుల బట్టీ మాటామంతీ లేదు. పిల్లని ఒంట్లో కూడా పెట్టుకుని దానితోపాటు తనూ బాధపడుతూ కూర్చున్నారు. ఇవాళ నువ్వొచ్చేసరికి ఇలా లెక్చర్లు దంచుతూంటే నాకు ఆశ్చర్యంగా ఉంది. అదలా ఉంచి నీకు ఉత్తరం రాద్దామంటే తను రాయరు, నన్ను రాయనివ్వరు. 'వెర్రి మొద్దా, వాడొచ్చి ఏం చేస్తుంది!' అంటారు. వద్దని పైకి అంటున్నా ప్రతి క్షణం నిన్నే తలుచుకుంటున్నారని ఎవరికైనా ఇట్టే తెలుస్తుంది. అందుకే రాశాను ఏం చెయ్యడం, దురదృష్టవంతులం. దాన్ని దక్కించుకో లేక పోయాం. ముందుగానే కనుక్కుంటే పిల్ల బ్రతుకునేమో!

వదిన కళ్ళమ్మట, జలజలా కరిగిన మైనపు వత్తి చుక్కల్లా కన్నీటి బొట్లు రాలాయి. ఆమెను ఊరుకోబెడదామనుకున్న నాకే దుఃఖం ఆగలేదు.

ఒకవంక నా మనసంతా ఇంటి వైపే ఉంది. ఆయన క్యాంపు నుంచి ఎప్పుడొస్తారో.... వారి బంధువులు గాని వచ్చి ఎవరూ లేరని వెళ్ళిపోయారో ఏమిటో.... సమయానికి నేను లేక పోతే ఆయన ఏమనుకుంటారో ఏమిటో.... ఇలా భయాందోళనలతో బాధపడ్డాను. ఇవతల పిల్లకు తగని కష్టం వొచ్చినపుడు కూడా దగ్గరుండి నాకు తోచిన సహాయం చెయ్యలేక పోయాను గదా అనిపించింది.

ఆ మర్నాడు సాయంకాలం అన్నయ్య వస్తూనే అన్నాడు :

'హార్టీ కంగ్రాట్యులేషన్సు మంజులా ... నువ్వు పరీక్ష ప్యాసయ్యావు. అతన్ని పరీక్ష ప్యాసు చేయించడంలో మాత్రం ఫెయిలయ్యావు!'

నా కాళ్ళ కింద భూమి పక్కకి జరిగిందా అనిపించింది.

'నీకెలా తెలిసిందిరా అన్నా ?'

'ఇక్కణ్ణుంచి పరీక్షకు వెళ్ళిన వాళ్ళు కూడా ఉన్నారుగా మరి! వాళ్ళతో నీ నెంబర్లు కూడా ఇచ్చేను. నీది ప్యాసైంది. నీ నెంబరు నాలుగొందల ఒకటి కదూ ?' అవునన్నాను. ఆయన నెంబరూ సరిగ్గానే చెప్పేడు. ఆయన్ది పోయిన మాట నిజమే. నా గుండెలు కొట్టుకున్నాయి.

'ఇప్పుడింకొక అరగంటలో ప్యాసెంజరుందిగా, పోతాన్రా' అన్నాను.

'అదేమిటే, రేపు వెడతానన్నావ్‌గా ?'

'లేదురా, వెళ్ళిపోవాలి. చెప్పకుండా వచ్చానని ముందే చెప్పేగా ?'

'ఇద్దరూ కలిసివెళ్ళారు. ఇద్దరూ సరదాగా ప్యాసై ఉంటే బాగుణ్ణు'

అంది వదిన నా మనసులో మాటను.

'లేదు. బావ ప్యాసై దాన్ది పోయినా అదింత సంతోషించి ఉండును'

అన్నాడు అన్నయ్య నా మనసులోని మాటను.

'అయినా ఏం పరీక్షలో ఏం లోకమో ఎప్పుడయి పోతాయో పిల్ల ఒప్పబడి పల్లబడి పోయింది గదమ్మా' అంది వదిన. నేను మాట లేవి వినడ



# తన రూపము చూసి తానే ముగ్ధురాలయింది...

లక్మే ఫేస్ పౌడర్ రాసుకోగానే రూపమునకు ఒక అద్భుతమైన ఆకర్షణ వస్తుందని ఈమె అంటోంది.

## లక్మే ఫేస్ పౌడర్
## లక్మే కాంపాక్ట్



ప్రత్యేక కానుక : శృంగారము, సౌందర్యము పెంపొందించు కొనుటకై ఇంగ్లీషులో వ్రాయబడిన చిన్న పుస్తకమును ఉచితముగా పొందండి.
ఈ ఎడ్రసుకు వ్రాయండి.
లక్మే లిమిటెడ్, లేంబె హౌస్, బ్రూస్ స్ట్రీట్, బొంబాయి 1.

# లక్మే

లేదు గబగబా మధురిమకు జడలు వేసి రిబ్బన్లు పెట్టి బట్టలు సర్దేసి మొహం రుద్దుకుని సిద్ధపడిపోయాను. వీధిలోకి వచ్చి కనబడిన ఖాళీ రిక్షాలో సామాన్లు పెట్టించి 'పదరా అబ్బాయ్ స్టేషనుకి' అన్నాను రిక్షా కన్న, రైలుకన్న తొందరగా పరిగెడదామని నా మనసు ఆరాట పడ తోంది. ఒక ప్రశ్నకు జవాబు తెలియాలి' ఈ పరీక్ష ఫలితాల మీద ఆయన ప్రభావం ఎలా ఉంటుంది ?'

* * *

నేను ఇంటికి చేరుకుంటూనే వీధిగొళ్ళెం వైపు చూశాను అక్కడ తాళంవేసి లేకపోవడంతో నా గుండె దడదడ లాడింది మధురిమను చేత్తో నడిపిస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వెళ్లేను ఆయన పడకుర్చీలో కూచుని అటు తిరిగి గుక్ గుక్ మని సిగరెట్టు పొగ ఒదుల్తున్నారు నా రాక గుర్తించక పోతే మానె పిల్లనయినా దగ్గిరకు తీసుకోనంత తప్పు నేనేం చేశాను ? హోటల్ నుంచి టిఫిన్ తెప్పించి దానికి పెట్టి బట్టలు మార్చి దాన్ని ఆటకి పంపేశాను. ఆయన దగ్గిరగా వెళ్ల ఏదో చెప్పబోయాను వారు మరింతగా అటువైపు పడక్కుర్చీలో ముడుచుకు పోయి పుస్తకంలో లీనమై పోయారు చాతకాని తనంతో నాకు కళ్లమ్మట గిర్రున నీళ్లు తిరిగేయి తగినంత కారణం ఉండబట్టే చెప్పకుండా వెళ్లడం జరిగింది. ఇంతకీ చిన్నారిని ఆఖరుసారిగా చూసుకోడానికి వీల్లేక పోయింది వెళ్లేటప్పుడు అన్నీ రాసి ఉత్తరంలో పెట్టి వెళ్లవే వెళ్లాను దానికింత శిక్ష దేనికి ? చిన్నారి చావు బతుకుల కన్న ఆయన వాళ్లు వచ్చారో లేదో అన్నది అంత ముఖ్య విషయం కాదే! ఇంతకీ ఇంటి కొచ్చిన మనిషిని ఎప్పుడొచ్చావని పలకరించక పోడానికి నేను చేసిన మహాపరాధం ఏమిటో !

ఇటువంటివి మా కాపురంలో ఇవే కొత్త. ఓ అరగంట సేపు ఆలోచిస్తూ అలా గదిలో ఉండి పోయాను ఆఖరికి ఆయనకు లేకపోతే నా బుద్ధి ఏమైందనిపించింది. అభిమానపు తెర చీల్చుకుని మళ్లీ వెళ్లాను.

'ఏమండీ, మీ కామేశ్వరక్కా వాళ్లూ వచ్చారా?' జవాబు లేదు తలెత్తి చూశాను ఆయనే అక్కడ లేరు! వీధివైపు డ్రాయింగు రూంలోకి వచ్చాను అక్కడా లేరు నాకేం చెయ్యాలో తోచలేదు మొట్ట మొదటే నేను పలకరించి ఉంటే ఇంత వరకూ రాకపోనుగదా అనిపించింది తప్పుచేసినట్టు క్షణ మాత్రమేనా నేను అనుకోలేదు గాని జరిగిన దానికి మహా చికాకనిపించింది మధురిమ వచ్చి 'అమ్మా, ఆకలే' అని నా భుజాలు పట్టుకు ఊపే దాకా అక్కడ కూలబడే ఉన్నాను. కూరలు తెప్పిద్దామని దాని చేత బంట్రోతుకి కబురంపించాను

'మేం లేనప్పుడు మనింటికి చుట్టాలు ఎవ రేనా వచ్చేరా పోతురాజూ ?'

'వచ్చిన జాడ లేదులమ్మీ . అయినా సరిగ్గా నా కెరిక నేను కూడా వంటేదానికి ఒంట్లో ఉడుకుగా ఉంటే న్రాత్రోలు సెలవెట్టే సినోను తమరు కవురంపించారని ఒచ్చినాను గాని ఇసుమంటి టయింలో దేవుడేవుడు పిలుస్తే మాత్రం కదుల్తానా తల్లీ ?'

వాడి పిల్ల జబ్బూ అదీ ఏ కరువు పెట్టడం ప్రారంభించాడు. ఆ సోది వినలేక నాకు విసుగనిపించింది.

'కొంచెం మార్కెట్‌కి వెళ్ళి బంగాళ దుంపలూ ఉల్లిపాయలూ తెచ్చిపెడుదూ అలా వచ్చేటప్పుడు క్లబ్బు కెళ్లి ఆయన ఉన్నారేమో చూసిరా'

తలనొప్పిగా ఉండి స్నానం చేసి తల ఆరబెట్టుకొంటూంటే వాడు వచ్చాడు. ఆయన మళ్లీ క్యాంపుకి వెళ్లారుట మూడు రోజులకి గాని రారుట ! భోంచేశాక మధురిమతో పాటు పడుకున్నానేగాని అయిదు నిమిషాలు ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. వేదన అంటే ఏమిటో ఎరగని నా మనస్సుకు ఈ మాత్రం బాధ భరించడమైనా కష్టమై పోయింది లైటు వేసి ఏవేవో పాత పత్రికలు తిరగేశాను దేనిమీదా దృష్టి పోలేదు ఎదురుగా అల్మారాలో ఉన్న ఎం. ఏ నోట్సు గైడ్సూ నన్ను వెక్కిరించి నట్టయింది లిటరేచరు లాంటి కష్టమైన విషయాన్ని తీసుకుని మొదటి

విలేఖరి : మీరు ముసలివారై పోతున్నా ఇంకా హీరోయిన్ రోల్సు వేస్తూ ఉండటానికి కారణం ?

తార : ఏముంది! వయసులో ఉన్నప్పుడు ముసలి వేషాలు వేయలా ?

ఎస్ మాధవ (విజయవాడ)

సారే ప్యాసయానవే తృప్తి నాకేమాత్రమూ కలగలేదు.

ఆవాళ బాగా తెల్లవారేక గాని నాకు మెలకువ రాలేదు ఓవల్టీను తాగేసి మధురిమ ఆడుకోడానికి పారిపోయింది నేను ఏదో కూర తరుగుతున్నాను వీధిలో రిక్షా ఆగినట్టై చేతులు తుడుచుకుని ఇవతలి కొచ్చాను. ఒరబర పట్టుచీర చప్పుడు చేసుకుంటూ కామేశ్వరీ, కనక మహాలక్ష్మమ్మ గారూ లోపలికి వస్తూంటే పిల్లిద్దరికీ కాక ఇంక మరొకరికి ఆ హాల్లో చోటుండా అనిపించింది.

'నమస్కారం లోపలికి రండి'

'ఏడీ మా వాడూ ? ఇంట్లో లేడూ ?'

'లేరండీ, క్యాంపుకి వెళ్లారు'

'ఎప్పుడొస్తాడూ'

'ఎల్లుండి రావచ్చు'

'అప్పో ఎల్లుండే, అందాకా ఎవరుండగలరూ? ఉత్తరం వేశామే, అందలేదూ ?'

నేనేమీ మాటాడలేదు నాకా ఉత్తరం గురించి ఏమీ తెలీదు

'అన్నయ్య లేకుండా ఇక్కడ ఉండడ మంటే అదోలా ఉంటుందే పిన్నీ నాకూ.... వెంటనే వెళ్లిపోదాం పదవే'

మరొక పరిస్థితుల్లో అయితే 'తక్షణమే దయచెయ్యండి' అని ఉందును ఆ వయారాలు చూసి. అసలే గాయపడిన నా మనసు ఇంకా తొందర పడదలుచుకోలేదు.

'మీ అన్నయ్య లేకపోతే మాత్రం నేను లేనా ఏమిటి వదినా అలా కొత్తగా మాటాడతారు? అయినా ఇది మీకు పరాయి ఇల్లా ? రాకరాక అన్నా ళ్లకి వచ్చారు గదా, ఓ నాలుగు రోజులైనా ఉండ కుండా మిమ్మల్ని వదిలిపెడతా ననుకున్నారా ?'

'పిన్నీ, చూశావటే వదిన గడుసుతనం, నాలుగు రోజుల్లోటే మనల్ని సాగనంపేద్దామని చూస్తోంది !' మరిందులో ఏ మాత్రం హాస్యముందో ఇద్దరూ కలిసి ఇల్లెగిరి పోయేటట్టు నవ్వడం ప్రారంభించారు ఈ హడావిడికి పక్కింట్లో తొక్కుడు బిళ్ల ఆడుతున్న మధురిమ దాని ఫ్రెండ్సు ముగ్గురితో సహా అక్కడికి వచ్చింది అదేమిటో చూద్దామని

'ఎవర్తె ఇందులో నీ కూతురూ ?' అంది కనక మహాలక్ష్మమ్మ.

'చెప్పుకోండి చూద్దాం' అన్నాను సంకేతనంగా.

'బాగుందే నీ వరస, ఇదేకదా మొదటిసారి చూడ్డం, మాకెలా తెలుస్తుందీ !' అంది ఆవిడ.

'మనల్ని అంత తెలివితక్కువ వాళ్ల కింద కట్టేసింది వదిన ఇంతకీ అదేమంత కష్టమని !'

అని కామేశ్వరి నలుగురు ఆ పిల్లల్నీ పరకాయించి చూసింది పట్టుపరికిణీ పట్టుజాకెట్టూ తొడుక్కుని, పళ్లో ముత్యాల పిన్నును పెట్టుకుని, జడగంటలూ, చేతికి ఎనిమిదేసి జతల బంగారు గాజులూ ఉన్న ఎదురింటి వరహాల శ్రేష్ఠి గారి అమ్మాయి గోవర్ధనాన్ని చూపి ఇట్టే పోల్చేసుకుంది

'దాచుకుంటే మాత్రం దాగుతుందటే అమ్మాయా ఏ రహస్యం ! ఈ ముక్కూ ఈ మొహం మా తమ్ముడివి అలా కొట్టొచ్చినట్టు కనబడ్డంలేదూ ? అసలు ఆ పిల్ల గుమ్మంలోకి రాగనే పోల్చేశాను ఆ నడక చూసి, ఇప్పుడేమంటావ్ మేనగోడలా ?'

అని ఆ పిల్ల చెయ్యి పట్టుకుని కామేశ్వరి లాగింది ఆ పిల్ల బెల్లబోతూ ఉందేమో తూలి పడి నిలదొక్కుకోలేక పక్కనున్న లక్ష్మమ్మ గారి మీద పడింది ముగ్గురూ, అంటే కుర్చీతో సహా వాళ్లిద్దరూ మరుక్షణం నేల మీదున్నారు పిల్లలందరూ గొల్లుమన్నారు నాకు ఉపుకుందామన్నా నవ్వాగలేదు అలాగే పడిపోయిన దాన్ని లేవదీయబోయాను. విసిరి కొట్టేసింది.

'నాకు సన్మానం చెయ్యండయ్యక్కర్లేదులే! నవ్వుకున్నంతగా నాకేం దెబ్బ తగల్లేదులే! నా ఇదేం హాస్యమమ్మా మాయదారి హాస్యం! అయ్యో అయ్యో పట్టుకోండ్రా జీవుడు ఎగిరిపోతూంది'

కామేశ్వరి ఆమెను నెమ్మదిగా లేవనెత్తి పడక్కుర్చీలో కూచో బెట్టింది నిజానికి పెద్ద దెబ్బ తగిలింది గోవర్ధనానికి. వ్రతంకి సివ్వడంయింది.

నేను టిఫినారగించి వచ్చేలోగా ఆ పిల్ల వొంటికి వోర్పులేక ఇంటికి దాటేసింది.

'అయినా అదేమిటత్తయ్యా నీకు మరీ అంత గడ్డి? ఎదురుగుండా బల్లమీద నాన్న నన్నెత్తుకు తీయించుకున్న ఫొటో నీకు కనబడలేదూ ?

అని మధురిమ అనేసింది నేను తప్పని చెబుతున్నా వినిపించుకోకుండా.

'బాగుంది. ఎవరికి తెలీదూ ? మీరంతా ఏమంటారోనని !'

అంటూ కామేశ్వరి మధురిమని దగ్గరకుని ముద్దెట్టుకుంది. ఆవిడకి పిల్లలంటే ముద్దు కాబోలు మరి వదల్లేదు ఆమాత్రం అల్లరితో ఆ సంఘటన అంతమయినందుకు నాకు సంతోషమే అనిపించింది. ముసలమ్మ మాత్రం ఆ చిప్ఫరంటూ చూడక మానలేదు. కాని మునుకు బాగా నోచిందని రకరకాల పట్లు వేసింది. మాత్రలు తెప్పించుకుని మింగింది. కొంప మునిగినట్టు కోలా పూరిగిరి పోయినట్టు అల్లరినూ.

'అదేమిటే అరేళ్ళ నీకు మళ్ళీ కానుపే రాలేదూ? ఎందుచేతా? అనడిగింది లక్ష్మమ్మ. నేనేం మాటాడను? నవ్వేసి పూరుకున్నాను.

'ఏమే మాటాడవేం, ఇన్నాళ్ళెందుకాలశ్యమైందీ అంట ?'

నే నప్పటికీ జవాబు చెప్పలేదు.

'మన్ను కాదన్నట్టు పూరుకుంటే నేను ఒదిలి పెడతాననుకున్నావు కాబోలు, చెప్పవే మంజూ ఏం ఎంచేతట ?'

అని పొగడేసింది మళ్ళీ. నాకు ఒళ్ళు మండిపోయింది. నేనేదో మందులు మింగుతున్నానని తెలిస్తే అది ఎంత అపచారమో అనారోగ్యకరమో చెబుదామని తహతహలాడుతున్నట్టుంది ఆవిడ. నాకు మా పెద్ద తిక్క పుట్టుకొచ్చింది. అడగకూడని విషయాలూ చెలరేగ నీయకూడని వ్యక్తిగత రహస్యాలూ కొన్ని ఉంటాయి. వాటి ప్రసక్తి తేవకపోవడమే సభ్యత.

'ఇలాంటి వాటికి జవాబే వుంటుంది పెద్దా? మీ కామేశ్వరికి పిల్లలెందుకు పుట్టలేదంటే మీరేం జవాబు చెప్తారు ?'

ఆ ప్రసక్తి తెచ్చేసరికి ఆవిడకి ఎక్కడలేని కోపమూ వచ్చినట్టుంది.

'ఆ మాటకి ఈ మాట జవాబా ? అది గొడ్డుమోతని ఎత్తి పొడుస్తావా ? ఇదేనా మర్యాద?

కళ్ళ నీళ్ళు తిరుగు తూండగా కామేశ్వరి?

'నేను ముందే చెప్పలేదటే పిన్నీ, అన్నయ్య లేందే మనకిక్కడ మర్యాద దక్కదని ! అన్ని విధాలా అందరికీ తగిన బుద్ధి చెప్పింది వదిన. పద పొమాన్ను నద్దేదాం'

వాళ్ళనేం వారించలేదు. కారణం లేకుండా కయ్యానికి కాలు దువ్వే వాళ్ళతో వాదనా, సమర్థనా కూడా దేనికి ? నిజానికి నీళ్ళు ఉండి అల్లరి పెట్టడం తప్ప ఉద్ధరించిందేమిటి ?

పెట్టె బెడ్డింగూ విప్పి ఇల్లంతా పరిచేశారు. కొళాయి విప్పినా ఫాను వేసినా మనం వెళ్ళి కట్టుకో

వలసిందే గాని వాళ్ళు మాటాడరు. లక్ష్మమ్మ సరేసరి కాస్త కాలు మడత బడిందో లేదో డాక్టర్ని పిలిచే దిక్కైనా లేదని గొణిగి చంపేస్తోంది. వాళ్ళు వెళ్ళిపోతే లేదో నాకు తెలీదు గాని సరిగా ఆ వేళకే మధురిమ కేకా వినబడ్డాయి.

'ఏంరా నువ్వు రేపు సాయంకాలానికి గాని రావని నీ పెళ్ళాం చెప్పిందీ ?'

అంది లక్ష్మమ్మగారు గుమ్మంలోంచే. ఆయన ఒక క్షణం ఆగి, తప్పరిల్లి, మాట మార్చి కామేశ్వరితో అన్నారు.

'ఎన్నాళ్ళకు దయగలిగిందే అక్కా ఈ బీదవాళ్ళ మీదా ?'

'రానూ వచ్చాం. తగిన సత్కారాలు పొందుతూ ఉన్నాం. అంది కామేశ్వరి నా వైపు అదోలా చూస్తూ, ఆయన నా వైపు కొరకొర చూశారు. నాకేం భయం ? నేను తిరిగి చురచుర చూశాను !

ఆయన ఇంచుమించు నాతో మాటాడ్డమే లేదు. వాళ్ళమందు ఆ విషయం తేలడం నాకు అనలిష్టం లేదు. పాపి మధురిమను పెట్టుకుని

రాధ : ఏమే లక్ష్మీ! మీ ఆయన ప్రొద్దున్న 7 గంటలకి ఆఫీసుకెళ్ళి రాత్రి 8 కి గాని రారంటున్నావే. అంతగా అక్కడేముందేంటి ?

లక్ష్మి : ఎయిర్ కండిషన్డ్ రూం వుంది.

సి. ఉపేంద్రబోగ్ (మద్రాసు)

గదిలో కూచుందామా అంటే అదివాళ్ళతో కలగలిసిపోయిందాయె. అందుకని ఆనాళ భోజనాలూ వాటికి సంబంధించిన పనులూ అయిపోయాక 'అలా శకుంతల గారింటికి వెళ్ళి ఓ గంటలో వస్తాను, మీరు వాళ్ళతో మాటాడుతూ ఉండండి అని ఆయనతో చెప్పి పక్కవీధిలో ఉన్న చిన్ననాటి స్నేహితురాలింటికి వెళ్ళేను. అది ఆ కబురూ ఈ కబురూ చెప్పేసరికి మరో గంట ఎక్కువైంది.

నేను తిరిగి వచ్చేసరికి వాళ్ళెవరూ ఇంకా ఉన్న జాడ కనపడలేదు. ఆయన యథాప్రకారంగా అటు తిరిగి పేపరు తిరగేస్తున్నారు.

'ఏమండీ, వదినా వాళ్ళూ ఏరీ ?'

'ఆలనా పాలనా లేకుండా పడి ఉండడానికి వాళ్ళేం మన దాసదాసీజనం కాదుగా ?'

నేను జవాబు చెప్పేలోగా ఆయన అందుకున్నారు.

'వాళ్ళు వస్తారని తెలిసి పూరువిడిచి వెళ్ళిపోయావు. వచ్చాక ఇల్లు విడిచి వెళ్ళిపోయావు. ఇష్టం లేకపోతే రావద్దని రాసెయ్య వలసింది. నీ చేత్తో నువ్వు రమ్మని రాస్తే గాని రానంత అభిమాన ధనులువాళ్ళు. పెళ్ళి అయిన తరువాత ఇన్నాళ్ళకు నా వాళ్ళు అన్నవాళ్ళు వస్తే ఇలా అవమాన

పరుస్తావా ? ఇదేనా నీ చదువు నీకు నేర్పిన పాఠం.

ఆయన అన్న అన్ని మాటలూ భరించాను. ఆఖరి ఆ ఎత్తి పొడుపుతోమాత్రం నాలోని ఉద్వేగం కట్టలు తెంచుకుంది. కళ్ళల్లో మంటలూ, చెవుల్లో వేడిగాలులూ వచ్చేయి. విరుచుకుపడే ఎత్తుకు కెరటం రాకూడదే గాని వచ్చిన తరువాత ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు! అయితే ఆయన ఇంకా రెచ్చిపోయారు.

'మేం ఉత్తరం రాశాం అందలేదా? అంటే మాటాడవుట, టేబిల్ మీద ఎదురుగా ఉన్న ఉత్తరం నువ్వు చూడలేదంటే ఎవరు నమ్ముతారు? నేను ఎల్లుండిదాకా రానని వాళ్ళతో చెప్పేవుట. నువ్వడిగావా నే చెప్పేనా అలా చెప్పడానికి ? వాళ్ళేం గతిలేక మన పంచన చేరలేదే ! అదలా ఉంచు, నీ పిల్ల ఎవరంటే చెప్పవుట, ఆ ముసిల్ది మక్కిలిగేలా పడితే నవ్వుతావుట, పైగా మా కామేశ్వరక్క గొడ్డుదని అడ్డమైన మాటలూ అంటావుట— ఈ లక్షణాలన్నీ ఎప్పుడు నీకు అలవడ్డట్టు? నీ మొగుడు కూడా ఒక మనిషే నని, వాడి తాలూకు వాళ్ళని కూడా నువ్వు పురుగుల్లా కాక మనుషుల్లా చూడవలసి ఉంటుందని కనీస జ్ఞానమైనా నీకు లేదా ? పెళ్ళి తరబడి నువ్వూ మీ అన్నా ఒకే సంసారంలా చలామణీ అవుతున్నా నే మాత్రం నేను అడ్డు పెట్టలేదనే కనీస కృతజ్ఞతైనా నీకులేదా ?'

ఆ మాటలకి నా హృదయం బోరని ఏడ్చింది. గుండె పరపరా కోస్తూంటే గుడ్ల నీరు కక్కుతూ పూరుకోడానికి నేనేం నోరులేని జంతువుని కాదు గదా !

'ఈ మాటలన్నీ దురభిప్రాయంతో అన్నవికావని ఏ నాటికయినా మీరు గుర్తించగలరు. మీ రన్న మాటలు ఎప్పటికైనా వెనక్కి తీసుకోగలరు. కాని అవి హృదయానికి చేసిన గాయాలు చెరిపెయ్యలేరు !'

ఆయన తలెత్తి నా వైపు చూశారు.

'నేను ఏ పరిస్థితుల్లో అక్కడికి వెళ్ళేనో అక్కడ ఏం జరిగిందో అది మాత్రం....'

ఇంక నేను ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చేశాను.

ఆయన గబగబ వచ్చి నన్ను పట్టుకొన్నారు.

'ఏం ఏమయింది ? ఎందుకలా ఏడుస్తున్నావ్? చిన్నారి పోవడం గురించి ఆయనకు చెప్పేను.

'అయ్యోయ్యో ఎంత పని జరిగింది ! ఏం జబ్బు చేసింది ? నాకు ముందే ఎందుకు చెప్పేవ్ కావ్ మంజూ !'

ఎన్నో చెబుదా మనుకున్నాను. కాని ఏం చెప్పలేక పోయాను. ఎదురు చూడని ఆ ప్యాంతనలో కరిగి నీరై పోయాను.

స్త్రీని లతతో పోల్చిన బుద్ధిమంతులు చిరస్మరణీయులు. కోపం వచ్చిన పాము తలప్పై కెత్తినట్టు అప్పుడప్పుడు ఏ ఆధారమూ లేకుండా లత ఒక పావుగజం మేర పాగుతుంది. కాని అలా ఎంత సేపు ఉంటుంది ? చిరుగాలి వీస్తే గజగజలాడి పోతుంది. ఎదురుగుండా ఓ ముళ్ళకంప కనపడినా చాలు ఆప్యాయంగా చుట్టు బెట్టుకుంటుంది. దాని కర్మమో కాల ధర్మమో! అదంతే. (సశేషం)



చక్కని విగ్రహం, ఆకర్షణీయమైన కళ్లు!

# కొత్తనటి కుమారి చంద్రకళ

కళ అనేది అందరికీ అబ్బదు. అది కొందరికి పుట్టుకతోటే వస్తుంది. వచ్చిన దానిని అభ్యాసంతో సాధన చేస్తే అభివృద్ధి అయి రాణించుతుంది. భరత నాట్యం రెండో ఏట నుంచీ కుమారి చంద్రకళకు వరంగా వచ్చినది.

చంద్రకళ 1945 డిశంబర్ 25న వాల్తేరులో జన్మించింది. ఆమె తండ్రి శ్రీ నాయక్ చలనచిత్ర వ్యాపారంలో సిద్ధహస్తులు, కృష్ణ పిక్చర్స్ (సంపిణీ) సంస్థలో భాగస్తులు. బాల్యం నుంచీ దైవ ప్రసాదితంగా వచ్చిన భరత నాట్యం ఆయన గమనించి, చంద్రకళను నాట్యంలో సుశిక్షితురాలిగా చేయాలనుకున్నారు.

ప్రఖ్యాత నాట్యకోవిదులు నటరాజ రామకృష్ణ వద్ద ప్రవేశ పెట్టారు. పసిదానిలోని ఉత్సాహం చూసి ఎంతో సంబర పడ్డారు, రామకృష్ణ. నృత్య భంగిమలు నొక్కొక్కటిగా చెబుతూ వచ్చారు. ముందుగానే నాట్యం పైన అమితమైన శ్రద్ధ ఉండటంచేత — క్షుణ్ణంగా గ్రహించి, అభినయం చేసి చూపుతూండేది.

చంద్రకళ తన అయిదవ ఏటనే 1954లో అనేక నృత్య ప్రదర్శనలు ఇచ్చి, అనేక బహుమతులు గెలుచుకున్నది. ఆ సంవత్సరంలో గుంటూరులో ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం జరిపినప్పుడు, ఆమె భరత నాట్యం చేసింది. హాజరైన వారంతా హర్ష పులకితులయినారు. ఆ సభకు వచ్చిన వారిలో అప్పటి రక్షణ శాఖామంత్రి డాక్టర్ ఖట్జూ కూడ ఉన్నారు. ఆయన చిరంజీవి చంద్రకళనూ, ఆ వయసులో ఆమె అభినయమూ చూసి చాలా ముచ్చటపడ్డారు; వృద్ధిలోకి రావాలని ఆశీర్వచనాలు పలికారు.

ఆ ఏడాదే ఆంధ్రా యూనివర్సిటీ (వాల్తేరు)లో కూడ ప్రదర్శనలు ఇచ్చింది చంద్రకళ. ఆ నాటి ప్రదర్శనలకు హాజరైన వారిలో నాటి గవర్నర్ సి. యం. త్రివేది, ఆయన సతీమణి, లోక్‌సభ స్పీకరు అనంతశయనం అయ్యంగార్, అసెంబ్లీ సభ్యులు శ్రీ సపల సూర్యచంద్రరావు ముఖ్యులు. ప్రదర్శనానంతరం ఆంధ్ర లెజిస్లేటివ్ క్లబ్ తరఫున వెండికప్పు బహుమతిగా ఇచ్చి, ఎత్తుకు ముద్దాడారు, అనంతశయనం అయ్యంగారు. త్రివేదీ దంపతులు తమ ఆశీస్సులు అందజేశారు.

ప్రఖ్యాత నర్తకి బాలసరస్వతి ఈ అమ్మాయిని గురించి వినడమూ, నాట్యాలు చూడడమూ జరిగింది. ఆమెకు ఈ చిరంజీవిలో నాట్యకళా లక్ష్మి గోచరించినట్లయింది. తనకు తెలిసిన లయలూ, భంగిమలూ కూడ నేర్పి, చక్కని నర్తకిగా రూపొందించాలనే బలీయమైన అభిప్రాయం ఏర్పడ్డది ఆమెకు. ప్రత్యేక శ్రద్ధ తీసుకుని ఎన్నో సంగతులు భరత నాట్యంలో చంద్రకళకు చెప్పింది అభినయ సరస్వతి, బాలసరస్వతి.

మద్రాసు మవుంట్‌రోడ్డులోని చిల్డ్రన్స్ థియేటర్‌లో 'అరంగేట్రం' ఇచ్చింది కుమారి చంద్రకళ. అది 1959 సెప్టెంబరులో జరిగింది ఆ సభకు ప్రఖ్యాత నాట్యాచార్యుడు శ్రీ ఉపయ



అప్పటి రక్షణమంత్రి డా. కట్జూ, కుమారి చంద్రకళ నభినందిస్తున్న దృశ్యం

శంకర్ అధ్యక్షత వహించారు. అమలాశంకర్ కూడా వచ్చింది.

చంద్రకళ అభినయం చూసి ముగ్ధులయినారు. ఉదయ, అమలాశంకర్‌లు. "భవిష్యత్తులో ఈ చిరంజీవి అఖిల భారతంలో కళాజ్యోతిగా ప్రకాశించాలని ఆశిస్తున్నాము" అన్నారు ఉదయశంకర్. అరంగేట్రం తర్వాత మద్రాసులో అప్పటి మంత్రి స్వర్గీయ డాక్టర్ యు. కృష్ణారావుగారి సమక్షంలో ఒకటి— కర్ణాటక రాష్ట్రంలోని ఉడిపిలో మధ్వాచార్యుల మఠంలో మరొకటి ఇచ్చింది.

మఠాధిపతి కూడ ఎంతో సంతోషించి, ప్రదర్శన ముగిసిన పిదప బహుమతి ఇచ్చి దీవించారు. ఆ ప్రముఖుల వచనాలే చంద్రకళ జీవితానికి ప్రవచనాలయి, నేడు ఆమెను నటిగా నర్తకిగా నిలబెట్టినవి. ఆమె నట జీవితానికి అవి బాట వేసినవి.



భవిష్యత్తుకు పూలబాటలు

ఆ తరువాత సినిమాలలో ప్రవేశం అయింది. 'షోలా అవుర్ షబ్నమ్' హిందీ చిత్రంలో బాల హీరోయిన్‌గా నటించింది. యుక్త వయసు వచ్చాక 'జేన్ గూడు' కన్నడ చిత్రంలో నటించింది. అది తెలుగులో వచ్చిన 'కులదైవం' చిత్రం ఆధారంగా నిర్మింప బడింది. జేన్‌గూడులో చంద్రకళ నిర్వహించినది ముఖ్య భూమిక. చిత్రం విడుదల అయిన తర్వాత ఆమె నటనకు అభినందనలతో అనేక ఉత్తరాలు— కన్నడ ప్రేక్షకుల నుంచి వచ్చినవి. అంతే కాదు, ఆ చిత్రంలో ఉత్తమ సహాయ నటిగా రాష్ట్ర ప్రభుత్వ పారితోషికం అందుకున్నది చంద్రకళ. ఆమె తండ్రి శ్రీ నాయక్ దర్శకత్వంలో తయారైన 'శ్రీరామాంజనేయ యుద్ధం' చిత్రంలో కూడ నటించి, ప్రేక్షకుల మెప్పులు బడసింది.



నటనలో నేగాక నాట్యంలో కూడా మంచినేర్పు ఉంది.

ఓ ప్రక్క నుంచి చిత్రాలలో నటిస్తుంటూ, మరో వైపు నుంచి చదువు కొనసాగిస్తూనే ఉన్నది చంద్రకళ. ఇప్పుడామె టి నగర్ లోని విద్యోదయ గర్ల్స్ హైస్కూల్‌లో చదువుకుంటున్నది. స్కూలు విడచిన తర్వాత డాన్సు అకాడమీకి కూచిపూడి నృత్యం నేర్చుకునేందుకు వెళుతుంది. చిన్న వయసులో ఇలాంటి ఉత్సాహం, నాట్యంపై ఇంత శ్రద్ధ ఉండడం హర్షణీయము.

తీరిక వేళల్లో చంద్రకళ నృత్యంలో కొత్త రీతులను సాధించేందుకు ప్రయత్నిస్తుంది. పుస్తకాలు చదువుతుంది. పిల్లలతో ఆడుతుంది. సరదాగా పాడుతుంది. క్రికెట్ మాచ్ అన్నా, టెన్నిస్ అన్నా ఇష్టం.

ప్రస్తుతం గోకుల్ ఆర్ట్ థియేటర్స్ వారి "ప్రేమించి పెళ్లి చేసుకో !" సాంఘిక చిత్రంలో ఓ ముఖ్య పాత్ర ధరిస్తున్నది. కుమారి చంద్రకళ యువనటిగా, నర్తకిగా తెలుగు వారికి ఈ చిత్రం ద్వారా పరిచయం కాబోతున్నది.

అందమైన గుండ్రని మొహం, పెద్ద పెద్ద కన్నులు, తీర్చి దిద్దినట్లుండే నాసిక, సన్నని పెదవులు. పారికలా పొడవుగా, చక్కని శరీర సౌష్ఠవంతో వెండితెరకు నిండుగా ఉంటుంది చంద్రకళ.

అలంకరణలు ఎక్కువగా చేసుకోదు. నిరాడంబరంగా ఉండట మంటేనే ఎక్కువ ఇష్టం. ఇచ్చిన పాత్రను అర్థం చేసుకుని నటించే శక్తిసామర్థ్యాలు గల చంద్రకళ— వెండి తెరకే వెలుగు !

— మోహన్ కుమార్ ★



1954 లో ఆంధ్రా యూనివర్సిటీలో జరిగిన సభలో శ్రీ త్రివేదితో



'కలలన్నీ నిజమయ్యాయి, తార సరోజాదేవి జీవితం ఆనందమయం అయింది"

ఫొటోలు పి వి యస్ శర్మ

# అందాలతార
# వెండితెర వెలుగు
# బి. సరోజాదేవి

వాశిరాజు ప్రకాశం

మధురాతి మధురమైన మధుమాసంలో గున్నమామిడి కొమ్మన ఎక్కి, నిక్కి నిక్కి చూస్తూ శ్రావ్యంగా వీనుల విందుగా కోయిలమ్మ పాడే పాట శ్రోతల హృదయాంతరాళలలో చొచ్చుకునిపోయి గిలిగింతలు పెడుతుంది, కొత్త వూహలను రేకెత్తిస్తూ కొంగ్రొత్త భావాలను సంతరిస్తూ సరికొత్త ఆశలను పూయిస్తుంది, సరోజంలా నిండుగులాబీల్లాగా!

కోయిలమ్మపాడే ప్రతిపాటకూ, ప్రతిరాగానికి నెమలిరేడు అనురాగంతో నృత్యంచేస్తే చల్లని చందమామ దొంగచూపులతో మబ్బుల చాటున దోబూచు లాడుతుంటాడు మరోవైపు వెన్నెల కన్నుల పండువుగా నిండు పున్నమికి ప్రత్యేక సంకేతంగా హాయిని గొల్పుతూ వుంటుంది

* * *

అందమైన ఆ కన్నులను గులాబీల రెమ్మల్లా ఆడిస్తూ ముత్యాల్లాంటి పలువరస వెలువరించే శ్వేత కాంతులను చిలకరిస్తూ, చిలుకలా పలుకుతూవుండే సుప్రసిద్ధ వెండితెర తార సరోజాదేవి యీనాడు ఆసేతు హిమాచలం ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా స్థానమేర్పరచుకొనివున్నది.

## ఉత్తర, దక్షిణాదిలలో ప్రసిద్ధ తార

దక్షిణాదిన తమిళ చిత్ర రంగంలో సరోజాదేవి పేరు చెపితే ప్రేక్షకులు ఆనంద డోలికల్లో తేలిపోతారు కన్నడ చిత్రరంగానికి ఆమె ఆడపడుచూ, అందమైన పడతి తెలుగులో సరోజాదేవి నటించిన 'పెళ్ళికానుక' నుంచి 'ఆత్మబలం' వరకూ ఆంధ్రులలో ఆమెకు విశేషమైన కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించి పెట్టాయి హిందీ చిత్రరంగంలో కూడా ఈ అందాలతార భగవద్దత్తమైన తన అందచందాల ద్వారా ఉత్తరాదిన ఉన్న ఇతర హిందీ తారలతో సమవుజ్జీగా తులతూగుతూ దక్షిణాదికొక విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొన్నది

"ప్రతిభ, ఆత్మవిశ్వాసం—" అనే రెండు చక్రాల గుర్రాలు జోడించిన రథం మీద కూర్చొని తానే సారథియై తనకు తానే విల్లంబు పుచ్చుకొని చైత్ర యాత్రలో దిగ్విజయంగా సమరం సాగిస్తున్న సరోజాదేవి కన్నడ దేశపు ఆడపడుచు అయినా రాష్ట్రీయ విభేదాలు భాషా తత్వాలు కీర్తి ప్రతిష్ఠలను, ప్రతిభా వ్యుత్పత్తులను ప్రభావితం చేయలేవని ఈ నట సోదాహరణంగా నిరూపించింది !

తూర్పున సూర్యభగవానుడి ఉదయించేందుకు సన్నాహాలు ప్రారంభించక పూర్వమే, సరోజాదేవి తన దైనందిన కార్యక్రమాన్ని ఆరంభిస్తూ ఉంటుంది తిరిగి ఆ సూర్యుడే పశ్చిమాన కొండల చాటున దాక్కున్న తరువాత ఎన్నెన్నో ఘడియలు గడిచాక ఆమె తన గూటికి చేరుతుంది రోజంతా నిర్విరామమైన కార్యక్రమం ! రేయంతా చాలీ చాలని నిద్రతో తిరిగి ఉదయం ఆరంభం ! ఇది నటి సరోజాదేవి వృత్తి వ్యాపకమూ !

## పూలబాటల్లో పయనిస్తున్న నటి

హిందీ తెలుగు కన్నడం తమిళం— నాలుగు భాషల్లోనూ కలిపి ఇంతవరకూ 80 చిత్రాలలో 80 రకాల పాత్రలద్వారా ఎన్నో రకాల హావభావాలను, నటన నృత్యాన్ని సరోజాదేవి ప్రదర్శించింది. వీటిలో చాలావరకు వీరి భవిష్యత్తుకు పూలబాటలు వేయ గలిగాయి ఆ పూల బాటల్లోనే ఈ నాడు నటి సరోజాదేవి హాయిగా కులాసాగా పయనం సాగిస్తున్నది

ఈ నాడు ఆమె కోసం ఆమె నటన కోసం కన్నులు కాయలు కాచేలా ఎదురు చూస్తున్న చిత్రాలు— వివిధ భాషలలో— దాదాపు ఇరవై ఉన్నాయి తనకు సంబంధించిన పనిని త్వరత్వరగా



మూడుగంటల సేపు జరిగిన ఇంటర్వ్యూలో సరోజాదేవి, విలేఖరి ప్రకాశం

# చిత్రసీమలో ప్రవేశించకపోతే, క్రైస్తవ సన్యాసిని అయివుండేదానిని: సరోజాదేవి కథనం!

ముగించుకొని, కాస్త అలా విశ్రాంతి పుచ్చుకొందా మని ఎప్పుడనుకున్నప్పుడు అనుకోకుండా, ఇంతలోకే మరికొన్ని చిత్రాల ఒత్తిడి తప్పనిసరికావటం — వీటితో నటి సరోజాదేవి పని మళ్ళీ పెరిగిపోవటం అలవాటుగా జరుగుతున్నదే !

కన్నడంలో విజయం సాధించిన "మహాకవి కాళిదాసు"తో సరోజాదేవి వెండితెరకు పరిచయ మయ్యింది. తెలుగులో వీరి తొలిచిత్రం "పాండురంగ మహాత్మ్యం", తమిళం "నాడోడి మన్నన్" తోనూ, హిందీ "పైగాం"తోనూ, ఆయా భాషల చిత్ర రంగాలకు ఈమె నటిగా పరిచయమయింది.

వారి కథనం ప్రకారం "1955–56లో సరోజాదేవి నటిగా" వెండితెరకు పరిచయమయింది. ఆ రోజుల్లో ఎక్కువ చిత్రాలు లేక పోవటం వల్ల, స్వస్థలమైన బెంగుళూరు నుంచి అవసరమయి నప్పుడు మద్రాసు వచ్చేవారట. కాలక్రమేణా, ఆ అవసరమే సరోజాదేవిని శాశ్వతంగా మద్రాసు నివాసిగా చేసింది.

## తండ్రి పోలికలు వచ్చాయా...?

బెంగుళూరులో ఆమె తండ్రి పోలీసుశాఖ ఉద్యోగిగా ఉండేవారు ! బహుశా, అందువల్లనే కాబోలు కూతురుకు కూడా దాదాపు పోలీసు ఆఫీసరంతటి విగ్రహమూ, అంతటి హుందాతనమూ అలవడ్డాయి.

బెంగుళూరు సెయింట్ థామస్ కాన్వెంటులో ఎనిమిదో తరగతి చదివిన సరోజాదేవికి చిత్ర రంగంలో ప్రవేశించే నాటికి పదమూడు సంవత్సరాల వయస్సని వారే చెపుతారు. 1956లో పదమూడు సంవత్సరాల వయస్సంటే, ఈ నాడు వారి వయస్సు 22వ ఏటాంటి పరిస్థితిలోనూ మించదన్న మాట ! వయస్సు మాట ఏమోకాని, వారి మానసిక పరిపక్వత, ప్రతిభలు దాదాపు 30 సంవత్సరాల వారికి ఉండదగ్గ స్థాయిలో ఉన్నాయి. తనకున్న ఆస్తి ఇంకా "మంచి అమ్మ, మంచి నాన్న ఇద్దరు అక్కయ్యలు" అని చెప్పింది సరోజాదేవి. సరోజాదేవి నటిగా ఇంతటి తారాపథాన్ని అందుకోవటానికి కారకులైన వారిలో— కన్నడంలో, అప్పటి సుప్రసిద్ధ నాయకుడు హొన్నప్ప భాగవతార్, తెలుగులో ఎన్. టి. రామారావు, తమిళంలో యం. జి. రామచంద్రన్ హిందీలో దిలీప్‌కుమార్ ప్రముఖులన్నారు.



నూతన నటి జయంతితో ఒకానొక షూటింగు సందర్భంలో ...!

## కొన్ని ప్రశ్నలు : సమాధానాలు

నటి సరోజాదేవితో మా విలేఖరి జరిపిన ఇంటర్వ్యూలో ఆమె వ్యక్తిత్వానికి, అభిరుచులకు సంబంధించిన ఎన్నో సంగతులు వెల్లడయ్యాయి. విలేఖరి వేసిన దాదాపు నూట ఒక్క ప్రశ్నలకు ఈ తార చెప్పిన సమాధానాల ద్వారా ఆవిడలో ఉన్న ఆత్మవిశ్వాసానికి తోడు అధికార దర్పం వెల్లడవుతాయి. ఉదాహరణకు కొన్ని ప్రశ్నలు, సమాధానాలు (ఆమె మాటల్లో)

ప్రశ్న : చూడండి మీరు, ఈ సినిమా రంగంలో ప్రవేశించకుండా ఉంటే, బహుశా ఏమయ్యి ఉండేవారు ?

జవాబు : క్రైస్తవ సన్యాసిని (కాథలిక్ నన్) అయి ఉండేదాన్ని ! (క్రైస్తవులు కాదు)

ప్రశ్న : ఏం ఆ రోజుల్లో మీకు సన్యాసం పుచ్చుకోవాలనే సరదా ఉండేదా ?

జ : కాదు సరదా ప్రసక్తేమీ లేదు. నేను 8వ తరగతి వరకు 'కాన్వెంటు'లో చదివానని ఇప్పుడే చెప్పానుగా ! అక్కడి వాతావరణమూ, బోధనలు ఎవరినైనా క్రమేణా "సన్యాసం"లోకి దింపవచ్చు. అక్కడ ఎప్పుడూ క్రైస్తవుల కథలు చెపుతూ ఉంటారు. ఇదీ కారణం.

## నాకీ వృత్తి నచ్చలేదు...!

ప్రశ్న : పోనీ, ఎలాగయితేనేం, సినీ రంగంలో మంచి స్థానాన్ని సంపాదించుకున్నారు. ఈ వ్యాపకం మిమ్మల్ని సంతోషపరుస్తున్నదా !

—ఈ ప్రశ్నకు తార సరోజాదేవి ఎంతో నిరుత్సాహంగా, నిర్లిప్తంగా సమాధానం చెప్తూ : "అబ్బెబ్బే ! ఏ మాత్రం నచ్చలేదు నాకు." అన్నారు.

ప్రశ్న : మరి, నచ్చకపోతే మరోమార్గం ఎందుకు చూసుకోలేదు !

జవాబు : ఇప్పుడెలాగయినా ఈ రంగంలోకి ప్రవేశించాం. మళ్ళీ మళ్ళీ ఇక్కడికీ అక్కడికీ మారటం కంటె, ఈ రంగంలోనే నలుగురి ఆదరాభిమానాలను సంపాదించుకొని విశ్రమించాలని నా సంకల్పం. పైగా, నేను సగర్వంగా చెప్పుకో గలిగిందేమంటే, నా చిత్రాలన్నిటికీ ప్రజలు ఎంతో ఆదరణ చూపుతున్నారు. నాటికీ విజయం విరివిగా చేకూరుతున్నది. ప్రభుత్వ స్థాయిన కూడా బహుమతులొస్తున్నాయి. అంతకంటె నా కేం కావాలి ?

—అని తిరిగి విలేఖరి వైపే ప్రశ్నార్థకంగా చూసింది సరోజాదేవి.

* * *

ఈ నాడు చిత్రాలలో వింత వింతైన ఆకర్షణలు చోటుచేసుకుంటున్నాయి. ప్రేక్షకుల బలహీనతలకు గాలం వేయాలనే కాంక్ష దర్శకుల్లోనూ,



అందమైన ఇల్లు ఇంటి ఆవరణలో సుందరమైన నీటి కుండీ దాని తీరాన సరోజాదేవి!

# దక్షిణాది చిత్రాలలో కథ చాలా బావుంటుంది

నటుల్లో ఎక్కువవుతున్నది అన్నిటితో బాటు సెక్స్ అనే అంశం కూడా నేటి చిత్రాల విలువకు చిత్ర మైన రగువ దిద్దుతున్నాయి. ఈ పద్మశ్రీ పురస్కారి చుకొని గ్లామర్ తార సరోజాదేవిని సినిమాల్లో సెక్స్ ప్రవేశ పెట్టటం గురించి అడిగాను.

## సినిమాలలో ప్రణయం అవసరమా?

వారి కథనం ప్రకారం కేవలం సెక్స్ కోసమే దాన్ని ప్రవేశ పెట్టటం తప్పు. జగదేక వీరుడు లాంటి చిత్రాలలో చేసిన ప్రకార అవసరానికి అనుగుణ్యంగా 'సెక్స్' ఉంటే ఫరవాలేదు అంటారు సరోజాదేవి.

ఇంగ్లీషు చిత్రాలు వారికి బాగా నచ్చటం నచ్చక పోవటం చెప్పటం కష్టసాధ్యం. కారణం వార చూసింది ఒకే ఒక సినిమా — క్లియోపాట్రా. ఈ చిత్రంలో ఎలిజబెత్ టేలర్ నటనను గురించి చెపుతూ: ఐ లైక్డ్ సో మచ్ అన్నారావిడ.

తనకు నచ్చని సన్నివేశాలలో నటించే దుకు ఆమె సుముఖురాలు కాదు. వాటిని తిరస్కరించే స్వాతంత్ర్యం నాకు ఎప్పుడూ ఉంటుంది అన్నారు వారు.

## ఉత్తర, దక్షిణాది ప్రాంతాల చిత్రాలు

ఉత్తరాది, దక్షిణాది చిత్రాలల్లో విరివిగా నటించిన సరోజాదేవికి ఉభయ ప్రాంతాల చిత్రాలలోని తార తమ్యాలు తెలిసికొనే అవకాశాలు కూడా విరివిగా ఉన్నాం.

ప్రశ్న: ఉభయ ప్రాంతాల్లోని పరిశ్రమల్లో ఏది మేలనిపించింది మీకు?

జవాబు: దక్షిణాదిన తయారయ్యే చిత్రాలలో కథలో ఎప్పటి కప్పుడు కొత్తదనం ఉంటుంది. ఉత్తరాది 'టెక్నీషియన్లు' అసమానమైన ప్రతిభావంతులు.

ప్రశ్న: ప్రపంచ స్థాయిలో ఖ్యాతి పొందుతున్న బెంగాలీ చిత్రాలు మీకు నచ్చాయా?

జవాబు: నచ్చాయి! ఆ మధ్య మ్యాడ్రిడ్‌లో

# 'నల్లధనం' అనేవారే అందరూ...! కాని, మా బాధలు వాళ్ళకెలా తెలుస్తాయి?

జరిగిన అవార్డు ప్రదానం సందర్భంలో ఒక చిత్రాన్ని చూచాను

ప్రశ్న : కేవలం ఒకే చిత్రం చూచానంటు న్నారు ఆ ఒక్క చిత్రాన్ని ఆధారం చేసుకొని ఆ గాలీ చిత్ర పరిశ్రమను గురించే అభిప్రాయం వెలిబుచ్చటం ఎలా సమంజసం?

జవాబు నేను చూచిన చిత్రం అది నాకు నచ్చింది అది నాకు తోచింది చెప్పాను

ప్రశ్న అమెరికా లాంటి దేశాల్లో తయారైన చిత్రాలను గురించి ఏమన్నా చెప్పగలుగుతారా?

జవాబు : అక్కడి చిత్రాలు చాలా చిన్నవి మన దేశం చిన్న చిత్రాలు వాపు మన ప్రేక్షకులకు నాన్న విషాదం మ్యూజిక్ డాన్స్ హాస్యమూ

జ క్రిస్మల్లో తల్లిగానే నటిచానుగా?

ప్రశ్న ఎంత కాలం ఈ సినిమా రంగంలో ఉందామనుకొంటున్నారు?

జవాబు ఏమో నాకేమీ తెలియదు ఒక్క మాటలో చెప్పాలంటే భగవంతుడి అనుమతి ఉన్నంతకాలం!

## విదేశాలకు వెళ్లాలనే వుంది కాని టైమ్ లేదు!

ప్రశ్న విదేశాలు చూడాలని జీవితాన్ని అనుభవించాలని మీకే అభిప్రాయం లేదా?

జవాబు విదేశాలు వెళ్ళాలనే ఉంది కాని ఎలా



కారులో షికారు వెళ్ళటం ఎంతో ఆనందంగా వుంటుంది

కాలి? ఇక వాటికి వీటికి ఎలిక ఎక్కడ ఉంటుంది

ప్రశ్న పోనీ కొత్తదనం ప్రవేశపెడితే మన చిత్రాల్లో కూడా ఉన్నత ప్రమాణాలు సిద్ధించవంటారా?

జవాబు ప్రయోజనం లేదు ఇంగ్లీషులో చూచి శేష్ అన్న సన్నివేశాలే ఇండియన్ పిక్చర్లో చూపిస్తే బాగా లేవంటారు మన ప్రేక్షకులకు చివరకు ఎలాగైనా నాయికా నాయకులకు పెళ్లి కావాలి లేకపోతే ఆ సినిమా పడదు!

ప్రశ్న మీకు ఎలాంటి పాత్రలు ఇష్టం?

జవాబు నా పాత్రలు మనసుకు హాయిస్తే అన్నీ ఆమోదయోగ్యమే

ప్రశ్న తల్లిగానైనా నటిస్తారా?

జవాబు ఎందుకు నటించను! అవసరమైతే

వెళ్లను టైమ్ ఒక్క క్షణం అయినా దొరకటం లేదుగా! ఏ క్షణాన చూచినా నా నెత్తిన కొండంత బరువు ఉన్నట్లు కనిపిస్తాను ఇలాంటి స్థితిలో విదేశాలకు ఎలా పోవటం?

ప్రశ్న తెలుగులో మీ అభిమాన నాయకులెవరు? శ్రీ యన్ టి రామారావు మీకు తొలిసారిగా తెలుగులో పాండురంగ మహాత్మ్యంలో అవకాశం ఇచ్చారు కదూ!

జవాబు అవును రామారావుగారే ఇప్పించారు ఆయన చాలా మంచివారు

ప్రశ్న అంటే నాగేశ్వరరావుగారు మంచివారు కాదంటారా?

జవాబు అయ్యయ్యో! అలాగంటే ఎలా నండి? ఇద్దరూ మంచివారే పెళ్లికానుక చిత్రి



చక్కని విగ్రహం ఆకర్షణీయమైన రూపురేఖలు నటి సరోజాదేవి వ్యక్తిత్వానికి వన్నె తెచ్చాయి

రణ సందర్భంలో నాగేశ్వరరావుగారు స్పష్టంగా తెలుగు చెప్పారు

## నల్లధనం

ప్రశ్న ఈ మధ్య సినిమా తారల ఇళ్ళలో నల్లధనాన్ని ప్రభుత్వం వశపరచుకొంటున్నదిగా? దీనిపై మీ వ్యాఖ్య!

జవాబు తారల డబ్బును నిర్దాక్షిణ్యంగా ఆలోచనారహితంగా దోచుకొనే ప్రభుత్వానికి మా కష్టాలు ఎలా తెలుస్తాయి? మంత్రుల ఇళ్లల్లో కూడా సినిమాతారల లెవరైనా ఉంటే మా డబ్బు



"ఒక్కమారు వెనక్కి తిరిగి చూసుకొంటె యీ నటజీవితంలో ఎన్నో సాధక బాధకాలు కనిపిస్తాయి"

# త్వరలోనే తార సరోజాదేవి వివాహం!

విలువ అప్పుడే వాళ్ళకు బాగా తెలుస్తుంది ఒకరు పయానా, భయానా చెప్పుకొన్నా వినుకోరు ఆ మంత్రులు

ప్రశ్న : చిత్రానికి దర్శకత్వం వహించాలనిగాని చిత్రనిర్మాణం చెయ్యాలనిగాని మీకేమైనా అభిప్రాయం ఉన్నదా ?

జవాబు అలా చెయ్యాలని కలలో కూడా అనుకోవటంలేదు !

ప్రశ్న ఏం ఆపని అంత కష్టమా ?

జవాబు ఎందుకులెండి అవన్నీ? అనుభవించే వాళ్ళకు తెలుస్తయ్ ఆ బాధలు

ప్రశ్న మరో సంగతి 'సెన్సార్' అనే విధానంతో చిత్రపరిశ్రమకు స్వాతంత్ర్యం తగ్గిపోతుందట ! మీరేమంటారు ?

జవాబు సెన్సార్ మన చిత్రాలకు చాలా అవసరం ! మనకు తెలియకుండా మనమే ఎన్నో తప్పులు చేస్తాం వాటిని సరిదిద్దేందుకు మరొకరు లేకపోతే మనకే ముప్పు కదా !

ప్రశ్న మిమ్మల్ని చూడాలని వచ్చిన అభిమానులను చూస్తే మీకెలా అనిపిస్తుంది ? అలాంటి వాళ్ళను అసలు చూస్తారా ?

జవాబు తప్పకుండా చూస్తాను కాని సమయం ఉన్నప్పుడే ఇది సాధ్యపడుతుంది

ప్రశ్న 'పూజా-పునస్కారం'- ఇలాంటి అలవాట్లు ఏమైనా ఉన్నాయా ?

జవాబు ఓ ఉన్నాయి రోజూ పది నిముషాలసేపు సేపు ప్రార్థన చేస్తాను

ప్రశ్న ఎవరికి ? లక్ష్మీదేవికా?

జవాబు ఆంజనేయస్వామి నా ఆరాధ్య దైవం



"పెళ్ళి మాట చెప్తే సిగ్గు ముంచుకొస్తుంది"



తెలుగు దేశమన్నా, తెలుగు వారన్నా నాకెంతో అభిమానం !

ఈ విధంగా కొనసాగింది ఇంటర్వ్యూ దాదాపు మూడుగంటలసేపు జరిగిన గోష్ఠిలో సరోజాదేవి తనకూ తన వృత్తికీ సంబంధించిన ఎన్నో సాధక బాధకాలను వెళ్ళవేసింది తెలుగువారన్నా తెలుగు దేశమన్నా తన కెంతో అభిమానమూ, గౌరవమూ వున్నాయని చెప్పింది

## త్వరలో సరోజాదేవి గృహిణి కాబోతోంది !

సరోజాదేవితో మా విలేఖరి చర్చించిన అంశాల్లో మరో ముఖ్యమైనది ఆమె వివాహం సంగతి త్వరలో వివాహం చేసికోవాలని, ఒక గృహిణి కావాలని ఈ తార ఉవ్విళ్ళూరుతున్నది కాని ఎప్పుడో ? ఎవరినో ?

ఆ బాధ్యత అంతా తల్లికీ తండ్రికీ వదిలేశానన్నది వివాహం చేసికోవటానికి యోగ్యుడైన వరుడు ఎలా ఉండాలో కూడా చెప్పలేకపోయింది ఆమె కాని తప్పకుండా పెళ్ళి చేసుకొంటానన్నది

'చెప్పలేని ఆ హాయి ఎంతో వెచ్చగ ఉంటుందోయీ' అంటూ నిన్న మొన్ననే ఒక తెలుగు చిత్రంలో తెలికాని గుండెకు హత్తుకొనిపోయిన సరోజాదేవి త్వరలో వివాహించటం తప్పకుండ హర్షింపదగ్గ విషయమే? మైసూరువారి ఆడపడుచు ఎవరింటి కోడలవుతుందో వేచి చూడవలసినఅంశం

'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ద్వారా నటి సరోజ దేవి తెలుగువారి ఆదరాభిమానాలకు అభిమానుల అనురాగానికి వినతులు అర్పిస్తున్నది అభిమాను లందరికీ ప్రత్యుత్తరంగా ఫోటోలు పంపలేకపోయినందుకు విచారం వెలిబుచ్చింది త్వరలో రానున్న "ప్రమీలార్జునీయం" ఎలా ఉందో తనకు వ్రాయమని కూడా ఈ తార కోరిక (చిరునామా సెకండ్ మెయిన్ రోడ్ గాంధీ నగర్ అడయార్ మద్రాసు)

**ఏమయినా, సరోజాదేవి తన అసమానమయిన ప్రతిభ, ఉత్సాహాల ద్వారా దక్షిణాది చలనచిత్రా రంగానికే కాదు హిందీ రంగానికికూడా వన్నెతెచ్చింది రానున్న కొద్ది సంవత్సరాలు ఇంకా రాణిస్తుంది. ప్రేక్షకులరాజ్యపు 'రాణి'గా ప్రకాశిస్తుంది**

★

# చిత్రలహరి

## ఫిల్మిస్తాన్ చిత్రంలో నాయకిగా రాజశ్రీ

ఈ విషయాలు వ్రాసేనాటికి నట రాజశ్రీ హిందీ చిత్రం షూటింగులో పాల్గొనేందుకు బొంబాయి వెళ్ళింది ఆమె ఫిలిమిస్తాన్‌వారి చిత్రంలో ప్రసిద్ధ నటుడు కిషోర్‌కుమార్ ప్రక్కన నాయకిగా నటిస్తున్నది తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ హిందీ భాషా చిత్రాలన్నింటి లోను ఆమె కిపుడు వేషాలు వస్తున్నవి తీరికలేని నటి అయినది కుమారి రాజశ్రీ ఇవాళ చిన్న వయసులో ఇలాంటి అభివృద్ధిని సాధించడం హర్షించదగ్గది



"సుమంగళి' లో ఒక దృశ్యం

## జానపద చిత్ర నిర్మాణం

ఈ మాప్రాంతంలోగా సెట్స్‌పైకి వెళ్ళే చిత్రాలు షుమారు రెండు డజన్ల ఉన్నవి వాటిలో కొన్ని సాంఘికాలు, కొన్ని జానపదాలు, మరికొన్ని పౌరాణికాలు ఇంకొన్ని చారిత్రాత్మకాలూ ఉన్నవి ఏమైనా ఈ సంవత్సరం సాంఘికాలకన్న జానపద చిత్రాల నిర్మాణమే ఎక్కువగ ఉండేట్లు కనిపిస్తున్నది; ఇప్పుడు వున్న పరిస్థితుల్నిబట్టి అవి పిస్తున్నది

## ఇల్లాలు

శ్రీమన్ రోజా ప్రసాద్‌గారి స్టూడియోకి ఆర్ట్లడం జరిగింది అర ఫర్లాంగు స్టూడియోకి ప్రక్కగా ఉన్నది ఇది ఇప్పుడు ఒక ఫ్లోర్ మటుకే తయారయి ఉంది అందులో వారి స్వంత చిత్రం 'ఇల్లాలు' కు గాను లాయర్ ఇంటి సెట్టు వేశారు కన్నులు మిరుమిట్లు గొల్పేంత చక్కగా ఉంది శిల్పం అది సెట్ అని తోచదు, నిజమైన ఇంటి కుండేంత సహజత్వం కళాదర్శకుడు చూపించాడు సెట్లో ప్రసాద్‌గారు కనిపించారు కెమెరామన్ ప్రసాద్‌కీ, నటీనటులకూ సూచనలిస్తూ

ప్రస్తుతం నాగేశ్వరరావుగా పిలువబడుతున్న కొత్త నటుడు, చలం, చదలవాడ కుటుంబరావు, అల్లు రామలింగయ్య, రామన్న పంతులు, మహంకాళి వెంకయ్య, నిర్మల, అవాళ సెట్లో ఉన్నారు

ఇంతవరకూ సహాయ భూమికలు ధరిస్తూ వచ్చిన గీతాంజలి ఈ చిత్రంలో కథానాయికగా కనిపించ బోతున్నది ఇన్‌డోర్‌లో ఇదే మొదటి షూటింగ్ షెడ్యూలు ఈ చిత్రమే తమిళంలో కూడ నిర్మింప బడుతున్నది అందులో కె ఆర్ విజయ నాయిక భూమిక ధరిస్తున్నది తెలుగు చిత్రానికి సంభాషణలు ముళ్ళపూడి వెంకటరమణ, పాటలు ఆత్రేయ వ్రాశారు రెండు చిత్రాలకూ సంగీతం మహాదేవన్, దర్శకుడు వి సంజీవరావు

* * *

శ్రీ దేవి ప్రొడక్షన్స్‌వారు తమ ద్వితీయ చిత్రాన్ని జనవరి నెలలో సెట్ మీదికి తీసుకెళ్ళటకు సర్వ సన్నాహాలు సాగిస్తున్నారు ఈ చిత్రంలో నూతన నటీనటులు కూడా నటిస్తారు దర్శకుడు సి పుల్లయ్య, రచన : సదాశివ బ్రహ్మం, సంగీతం, ఘంటసాల నిర్మాత : తోట సుబ్బారావు

— మోహన్‌కుమార్

# అవీ - ఇవీ - అన్నీ

## 'ఫిలిం వరల్డ్'

వివిధ దేశాలకు సంబంధించిన వివిధ భాషా సినిమా విశేషాలను నటీనటుల జీవిత విశేషాలను, ఇతర వివరాలను ప్రస్తావిస్తూ శ్రీ యం రంగనాధన్ ఇంగ్లీషులో వెలువరించిన 'ఫిలిం వరల్డ్' సంచిక మా కార్యాలయానికి చేరింది సమకాలీన సినిమా వాతావరణంలో— ప్రత్యేకించి 1964 లో వెలుగులోకి వచ్చిన నటీనటులను, దర్శక నిర్మాతలను, టెక్నీషియన్లను గురించి ఛాయా చిత్రాలతో ఈ పుస్తకంలో వ్రాయడం జరిగింది అన్ని భారతీయ భాషల సినిమా ముచ్చట్లూ, యునైటెడ్ అరబ్ రిపబ్లిక్, సిలోన్, ఇండియా, జపాన్ పాకిస్తాన్ చైనా, ఆస్ట్రేలియా బెల్జియం బల్గేరియా, జెకొస్లొవేకియా, డెన్మార్క్, జర్మని, ఫ్రాన్సు, రష్యా, అమెరికా తదితర దేశాలకు సంబంధించిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి. శ్రీ సత్యజిత్‌రాయ్ తొలిపలుకు, లోపలి పేజీల్లో శ్రీ కె ఎ అబ్బాస్ రచించిన ఒక వ్యాసము కూడా ఇందులో ఉన్నాయి చక్కని ఆర్టు పేపరు మీద ముద్రించిన ఈ పుస్తకం వెల పది రూపాయిలు ప్రతులకు : శ్రీ యం రంగనాధన్, 86 పాండీ బజారు, మద్రాసు—17

## 'బ్రిటన్‌లో విశేషాలు'

ప్రపంచ దేశాలన్నింటిలో 'బ్రిటన్'కు ఒక విశిష్టమైన స్థానమున్నది అందుకు ఎన్నో కారణాలున్నాయి 'బ్రిటన్‌లో విశేషాలు' అన్న తెలుగు పుస్తకాన్ని మద్రాసులోని బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసు వారు ప్రచురించారు ఇందులో— గత 25 సంవత్సరాలలో బ్రిటన్ సాధించిన కొన్ని ఘన విజయాలు, స్వాతంత్ర్యం కోసం సాగించిన పోరాటం, తరతరాల బ్రిటిష్‌వారి జీవిత విధానము, రాణీకథ, బ్రిటన్‌లో, లండన్‌లో చూడ వలసిన విశేషాలు, తదితర సంగతులున్నాయి చక్కని రంగుల ముద్రణ ఇది

'కొలంబో ప్రణాళిక'లో బ్రిటన్ కృషి అనే మరో తెలుగు పుస్తకంలో ఉభయ దేశాలమైత్రీ సంబంధించినవి, బ్రిటన్ ఆర్థిక సహాయ వివరాలు తదితర విశేషాలూ ఉన్నాయి

* * *

భువనేశ్వర్ ఆంధ్ర సంస్కృతి సమితి సభ్యులు డిశంబరు 20 వ తేదీన శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ రచించిన ''కీర్తిశేషులు' అనే నాటకాన్ని ప్రదర్శించారు ఈ నాటకంలో మురారి, వాణీనాథం, గంప శంకరయ్య పాత్రలను శ్రీ టి శ్రీరామమూర్తి, శ్రీ టి వి జగన్నాథరావు, శ్రీ వి మహాదేవం పంతులు నటించి ప్రశంసలను అందుకున్నారు మిగిలిన పాత్రలను కూడా శ్రీయుతులు కె జయదేవ ప్రసాద్, ఎస్ దుర్గాప్రసాద్ కె వి రంగయ్య, పి బి రామచంద్రరావు జి గోపాలస్వామి, వై ఎస్ ఎన్ మూర్తి, కె వి అన్నాజీరావు, హెచ్ వై రావు, ఎల్ రామనాథశాస్త్రి కె ఎస్ ఆర్ మూర్తిగార్లు పోషించారు శ్రీమతి ఎస్ రామలక్ష్మి జానకిగా నటించారు శ్రీ ఎస్ హనుమంతరావు ఈ నాటకానికి దర్శకత్వం వహించారు ★

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 22511. Chief Editor S. Sambhu Prasad.